# డిటెక్టివు

[నాటకం]

రచన:
శరదిందు బెనర్జీ

అనువాదం:
చక్రపాణి

యువ బుక్ డిపో
ఆచారప్పన్ వీధి :: గవర్నరుపేట
మద్రాసు :: బెజవాడ



# పాత్రలు

| | | |
|---|---|---|
| అనంతం | .... | డిటెక్టివు, జమీందారు |
| గోవిందు | .... | జమీందారు గుమాస్తా |
| గోపాలయ్య | .... | మీరా తండ్రి |
| మీరా | .... | గోపాలయ్య కూతురు |
| నళిని | .... | మీరా సఖి |

మీరా పెంపుడు తల్లిదండ్రులు, అనంతం తల్లి, అక్కావ్వైరాలు.



# ప్రస్తావన

[చక్కగా అలంకరించిన డ్రాయింగ్ రూం. సాయంత్రం నాలుగు గంటలు. తెరిచిన కిటికీలోనించి గ్రామం కనిపిస్తూ ఉంటుంది. ఆ ఊరి జమీందారూ, ఈ ఇంటి యజమానీ అయిన అనంతంచౌధరి, సోఫాలో వారగా ఆనుకుని మనస్సంతా లగ్నంచేసి డిటెక్టివు నవల చదువుతూ వుంటాడు. మధ్యమధ్య గుప్పెట బిగబట్టుతూ వుంటాడు. అందగాడు; ఇరవై అయిదు సంవత్సరాల ప్రాయం; మీసాలు గొరిగాడు. నోట్లో ఆరిపోయిన పైపు. ఆ గదిలో ఇంకో మూలను పక్కపక్కనే కూచుని అతని తల్లి విమల, అక్క రమా మెల్లగా మాట్లాడుకుంటూ వుంటారు. రమ ఏదో కుట్టుతూ వుంటుంది.]

రమ:- ఇకనైనా అనంతుకు పెళ్ళిచెయ్యి అమ్మా! యం. ఏ. ప్యాసయ్యాడు, పాతికేళ్ళు వచ్చినై—ఇంకా ఆగటమెందుకూ? మన ఇళ్ళలో అంత పెద్దవాడికి పెళ్ళిచెయ్యకుండా వుంచటం బాగుండదు. లోకులు నానా విధాల చెప్పుకుంటారు. మావారుకూడా జమీందారు కుర్రవాడికి అంత ఈడుదాకా పెళ్ళిచేయకండా ఊరుకోటం బాగుండదన్నారు.

విమల:- నాకు తెలియదటే ఆ సంగతి! తెలిసిమాత్రం ఏమి చేసేది? వాడొక వెర్రికం! పెళ్ళిసంగతి తెస్తేచాలు శివం ఎక్కినట్టు లేస్తాడు. ఎరుగుదువుగా వాడిని!

రమ:- ఏమిటేమిటీ! పెళ్ళిచేసుకోక ఏంచేస్తానంటాడు?

విమల:- ఏమిటో నా తలకాయ. వాడు చెప్పేదానికి తలా తోకా వుండదు. వాడి కి జీవితంలో ఎన్నో పనులున్నయట, ఉత్త పెళ్ళిచేసుకోవటమే కాదట! నాకేమీ తెలియదమ్మా, వాడి పనులేవిటో! చదువుకోవాలన్నాడు, చదువుకోమన్నాను. చదువుకున్నాడుకదా, లక్షణంగా పెళ్ళిచేసుకుని పెద్దలు ఇచ్చిపోయిన ఆస్తి చూసుకోకూడదూ? అదేమీలేదు—

పనులట, పనులు! ఎప్పుడూ ఏదో పుస్తకాలు చదువుతూ వుంటాడు. నా తలకాయ—

రమ:- అవి డిటెక్టివు నవలలు—అంతా ఖూనీకోరులూ, దొంగలూ, దోపిడిగాళ్ళూ వుంటారు అందులో. ఈ మధ్య తెలుగులోకూడా వచ్చినై, అవి నాకేమీ బాగుండవు.

విమల:- అట్లాగటే! మరి అందులో పెళ్ళి చేసుకోవద్దని రాసివుంటదా?

రమ:- ఊహుం! కాని అవి ఎక్కువగా చదివితే ఊహలు జాస్తి అవుతై, అన్నిటినీ సందేహిస్తూ వుంటారు.

అనంతం:- (తనలో తను ఉత్తేజితుడై) ఖబడ్దార్! ఒక్క అడుగు ముందుకు వేశావంటే—

విమల:- అదుగో! వాడిలోవాడు ఎలా వాగుకుంటున్నాడో చూడు ఏమే, చివరకు వాడికి పిచ్చి ఎక్కుతుందేమిటే?

రమ:- ఫరవాలేదమ్మా! పుస్తకాలు చదివినంతమాత్రాన పిచ్చెక్కుతుందా? మన అనంత కొంచెం పైత్యపు శరీరంవాడు. చిన్నచిన్నవాటికే ఉత్తేజితుడౌతాడు. అదీకాక కుర్రతనం. పెళ్ళిచేసివేస్తే అన్నీవదులుతై.

విమల:- నేను కాదంటున్నానా? విరాజపురం జమీందారు తన కూతురు నిస్తానని వెంటపడుతున్నాడు. కాని మనవాడు వొప్పుకుంటేకదా!

రమ:- నాకుతెలిసికూడా ఒకపిల్ల ఉందమ్మా! చక్కని చుక్క, ఒడ్డూ పొడుగూకూడా ఉంది. పద్దానుగేళ్ళు ఉన్నవన్నాకూడా అంతా నమ్ముతారు. మా తోడుకోడలికి చుట్టమే.

అనంతం:-(ఒక్కమాటుగా సోఫానించి ఎగిరి)ఖబడ్దార్, అక్కయ్యా! Hands Up.

రమ:- అదేమిటోయ్ మళ్ళీ?

అనంతం:- ఏమిలేదు. ముందు చేతులెత్తి తలమీదపెట్టుకో, లేకపోతే పేల్చిపారేస్తాను.

(పైపు పిస్తోలులాగా పట్టుకుంటాడు.)

రమ:- పిచ్చివేషాలు వెయ్యమాకు అనంత్!

TPLC1013296



అనంతం:- పిచ్చివేషాలుకాదు, ముందు చేతులెత్తి తలమీద పెట్టుకో, లేకపోతే ప్రాణాలు దక్కవు : వన్—టు—

రమ:- చాలుబాబూ: నీ యాతన పడలేకుండా ఉన్నాను. (చేతులు తల మీద పెట్టుకుని) చాలా?

అనంతం:- ఈ మాటు నిజంచెప్పూ, మీరు పన్నే కుట్రఏమిటీ?

రమ:- కుట్రఏమిటీ? నీకు పెళ్ళిచేయాలని ఆలోచిస్తున్నాము. పెళ్ళి చెయ్యకపోతే నీకు నిజంగా పిచ్చిఎక్కుతుంది.

అనంతం:- పెళ్ళా : (నవ్వుతూ) అయితే ఇక చేతులు దించుకో. సరేగాని అక్కయ్యా : నీవు ఇంతవరకు డిటెక్టివు పెళ్ళిచేసుకోవటం ఎక్కడైనా చూశావా? ఈ ప్రపంచంలో గొప్ప డిటెక్టివు ఎవడూ పెళ్ళి చేసుకోలేదు. అంతా బ్రహ్మచారులే,

రమ:- సరే, వాళ్ళ నల్లాగే ఉండనివ్వు! నువ్వు డిటెక్టివ్వు కావుగా- ఎందుకు పెళ్ళి చేసుకోవూ?

అనంతం:- నేను డిటెక్టివును కానా? అక్కయ్యా. నీకు తెలీదు గాని, నాలాంటి డిటెక్టివు ఘ్రాపపంచంలోలేదు: చెప్పమంటావా, ఇవ్వాళ నువ్వు ఏం భోంచేశావో ?—అయితే ఓను—వంకాయ పచ్చడి, మునక్కా- డల చారు, పప్పు ధప్పళం.

రమ:- చాలు, చాలు! చాలా కష్టపడ్డావు, ఇవ్వాళ ఇవన్నీ నువ్వు తిన్నవేగా!

అనంతం:- అయితే ఉండు. నువ్వు తలకు ఏ చమురు రాచుకున్నదీ చెప్పుతాను. (తల వాసనచూసి) రీటా!, చెప్పుకో, సరేనా ?....(తల్లితో) అదికాదమ్మా! నేను ఈ పనే చేద్దామని నిశ్చయించుకున్నాను.

విమల:- ఏ పనీ ?

అనంత్:- నేను డిటెక్టివ్ అవుతాను. మద్రాసుపోయి ఆఫీసు పెడతాను—అనంత దుర్గశాలయం! ఎంత బాగుందీపేరు! చిక్కుల్లో పడ్డవాళ్ళు వేలమంది నాదగ్గరికి వస్తారు. సొత్తు పోగొట్టుకున్నవాళ్ళూ,

పిల్లల్ని పోగొట్టుకున్నవాళ్ళు! వాళ్ళ సొత్తులు వాళ్ళకిప్పిస్తాను. ఏమను కున్నారు, ఎవడికి ఏఆపదవచ్చినా అనంతం దగ్గరికి పరుగెత్తుకురావలసిందే!

రమ:- (నొసలు బాదుకుని) ఖర్మ! ఇంతచదువూ చదివి ఆఖరికీపని చేస్తావా? అంతానవ్వరూ!

అనంత్:- (కళ్లు ఉరుముతూ) నవ్వుతారా? నవ్వమనూ — గుండె ఎవరికుందో? (గుమ్మంవైపు తిరిగి) గోవింద్, గోవింద్!

(గోవింద్ వస్తాడు. ఈ ఇంటిగుమాస్తా, 40 ఏళ్ళు ఉంటాయి, అనంతానికి ఇష్టుడూ అనుచరుడూ.)

గో:- ఏం బాబూ!

అ:- (రెప్పవాల్చకండా వాడివంకచూసి) గోవింద్! నేను డిటెక్టివ్ కాబోతున్నాను—నీకు నవ్వువస్తోందా?

గో:- చిత్తం. రావటంలేదు.

అ:- మానవుల కష్టాలను తొలగించడమే డిటెక్టివులపని. బుద్ధుడూ, ఏసుక్రీస్తూకూడా ఈపనే చేశారు. నేనుకూడా వారిలాగానే చేయబో తున్నాను. తెలిసిందా?

గో:- చిత్తం. తెలిసింది.

అ:- నవ్వురావటం లేదా?

గో:- (తలతిప్పుతూ) చిత్తం. లేదు.

అ:- అయితే పో. (గోవిందు వెళ్లిన తర్వాత అక్కతో) చూశావా అక్కయ్యా!

రమ:- నీ ఇష్టమొచ్చింది చేసుకోబాబూ! నేను నీతోపాటు పిచ్చి వాగుడువాగలేను. (లేవబోతుంది.)

అ:- ఉహుం. ఉహుం. కూచో! సుబ్బీ చొక్కా ఎవరికి కుట్టు తున్నావో చెప్పేదా? ఒక్క సెకండులో చెప్తాను—Deduction— తెలిసిందా Deduction!

రమ:- అయితే చెప్పు!

అను:- (కొంచెంసేపు కళ్ళుమూసుకొని ఆలోచించి, నెత్తిబాదుకుని) బావయ్యకోసం! అవునా?

రమ:- (నగంపుట్టిన ఎర్రఫ్రాకు బయటికితీసి) భలే చెప్పావు; మీ బావయ్యకు ఎర్రఫ్రాకులు వేసుకునే ఈడే! (నవ్వుతుంది)

అను:- (ఆశ్చర్యంతో) ఆఁ! అది ఫ్రాకా? అందుకనే మనసు ఎడా పెడా లాగింది. అయితే ఈమాటు చెప్తాను--

రమ:- చాలు! ఇక చెప్పనక్కర్లేదు. (మోటారుకారు చప్పుడు) ఎవరో వచ్చినట్టు ఉంది. లోపలికి పోదాం పద అమ్మా!

అను:- ఆగు. పోనక్కర్లేదు—ఎవరువచ్చిందీ నేను కారుశబ్దం వినే చెప్పతాను. (కళ్ళుమూసుకుని తనలో తాను) ఎనిమిది సిలెండర్ల బండి-ఒక సిలెండరు బాగా పనిచేయటంలేదు—నికిల్ ప్లేటెడ్ హారన్—తెలిసింది, అక్కయ్యా! బావ నిన్నుచూడడానికి వచ్చాడు.

(ఒక ముసలిఆతను వస్తాడు, అతని వెనక గోవింద)

అనంతం:- (కళ్ళుమూసుకునే) రండి, బావగారూ!

రమ:- (గాభరాగాలేచి, అనంతాన్ని నెట్టుతూ) ఊరుకో, దద్దమ్మా! కళ్ళుతెరిచిచూడు—రండి మామయ్యగారూ!

(వచ్చినఆయనకు నమస్కరిస్తుంది. విమల వెళ్ళిపోతుంది.)

అనంతం:- (కళ్ళుతెరిచి) అలాగా! బావగారు కారే—గోపాలయ్య గారు! హ్హా, హ్హా, హ్హా! చాలా పొరపాటయింది. అందుకనే మనస్సు ఎడాపెడా లాగింది! సరే, ఏదో జరిగిపోయింది. గోపాలయ్యగారు విరాజపురం జమీందారూ, బావగారు రాజపురం జమీందారు. కొంచెంలోనే తప్పిపోయింది—కూచోండి మామగారూ!

(నమస్కారం చేస్తాడు. ఆయన కూచుంటాడు)

రమ:- ఎన్నాళ్ళయినాక మళ్ళీ మామయ్యను చూడటం. వంటో కులాసాయేగా మామయ్యా! అత్తయ్య క్షేమమేనా?

గోపాలయ్య:- ఏమి క్షేమం? నే నేదో విధంగా లేచి తిరుగుతున్నాను గాని మీ అత్తయ్య మంచం పట్టింది. వొంటో ఓపిక వున్నంతకాలం ఏనాటికైనా రాకపోతుందా అని గుండె ధైర్యంతోవుంది. ఇప్పుడు బొత్తిగా ఆశ వదులుకుంది.

రమ:- (నిట్టూర్చి) నిజమే! ఎంతకాలమని వుంటుంది. ధైర్యం?

(కాసేపు అంతా నిశ్శబ్దంగా వుంటారు)

గోపా:- అనంతం యం. ఏ. పాసయాడని కొద్దిరోజుల క్రిందటే విన్నాను. నువ్వుకూడా అత్తవారింటినించి ఇక్కడికి వచ్చావని తెలిసింది. అందుకనే ఒకమాటు చూసిపోదామని వచ్చాను. ఇవ్వాళ బావ బ్రతికి వున్నట్టయితే ఎంత సంతోషించేవాడు—ఎన్ని ఉత్సవాలు చేయించేవాడు. సరేగాని నాయన చనిపోయి పదేళ్ళుకాలేదా?

రమ:- పన్నెండేళ్ళు.

గోపా:- కావచ్చు! మొదట మా అమ్మాయి తప్పిపోవటం. ఆ తర్వాత రెండేళ్ళ కనుకుంటాను, బావయ్య పోయింది. ఈ ప్రపంచంలో నాకు ఆయన ఒక్కడే ప్రాణస్నేహితుడు, అందుకనే భగవంతుడు నా ఒక్కొక్క బంధనాన్నే తెగ్గోసివేస్తున్నాడు. నాకు ప్రపంచంమీద విరక్తి కలిగింది. ఏపని చేద్దామన్నా—

(ఆయన గొంతులో నిరాశ కనపడుతుంది)

రమ:- మాయ జాడా ఏమీ తెలియలేదా?

గోపా:- లేదు తల్లీ! చచ్చిపోయిన సంగతైనా తెలిస్తే నాకు కొంత ఉపశాంతి కలిగేది!

రమ:- అదేమిటి మామయ్యా! మాయ తప్పకుండా బ్రతికివుంటుంది.

గోపా:- అదే, నమ్మకం కుదరకుండావుంది తల్లీ! ఒకవేళ బ్రతికి వుంటే ఏ స్థితిలోవుందో తండ్రినై తలుచుకోటానికే భయపడుతున్నాను. అంతకంటే ఆపిల్ల చచ్చిపోవటమే ఉత్తమం.

రమ:- (మెల్లగా) భగవంతుడలా చేస్తాడా?

గోపా:- అసంగతే అప్పుడప్పు డనుకుంటాను. నాకు తెలిసి నేనే పాపకార్యం చేయలేదు—అలాంటప్పుడు భగవంతుడు నా కిలాంటి శాస్తి ఎందుకు చేస్తాడు? వెతికించటంలో కూడా లోపం చేయలేదు. నా పిల్లను తెచ్చి వప్పగించినవారికి 20 వేల రూపాయలు ఇస్తానని ప్రకటించాను. కాని, ఏమీ లాభం లేకపోయింది. (కొంచెంసేపు ఊరుకుని, లేచి)

ఐతే వస్తానమ్మా. మీరు సౌఖ్యంగా వుండటంచూసి చాలా ఆనందించాను. అమ్మకు నా నమస్కారాలు చెప్పు.

(నేపథ్యాన్ని ఉద్దేశించి నమస్కరిస్తాడు)

అనంతం! నీపట్ల నా కర్తవ్యాన్ని ఏమీ నెరవేర్చలేకపోయాను, బాబూ! నేను నా గొడవలోనే వుండిపోయాను. నువ్వు బాగా చదువుకున్నావు; తెలివిగలవాడి వనిపించుకున్నావు. ఇక నాయన ఇచ్చిన జమీందారీ చూసుకుంటూ ప్రజలను కాపాడుతూవుండు. నా సహాయమేదైనా కావలిస్తే ఎప్పుడూ సిద్ధంగావుంటాను. ఒక్కటి జ్ఞాపకం పెట్టుకో. మీ నాయనకూ, నాకూ ఏమీ తేడాలేదు. మే మిద్దరమూ అంత మిత్రులం. నాకు పిల్లలెవ్వరూలేరు. పిల్లయైనా, పిల్లవాడిపైనా నువ్వే, చిరంజీవివి కమ్మని ఆశీర్వదిస్తున్నాను. (వెళ్ళబోతాడు)

అనంతం:- మామగారూ! కొంచెం ఆగండి. మీతో రెండుమాటలు మాట్లాడాలి.

గోపా:- (కూచుని) మంచిది. కానివ్వు.

అనంతం:- (కొంచెం ఆవేశంగా) మామగారూ! మీ మాటలు వింటుంటే నాలో ఒక గొప్ప ప్రేరణ కలిగింది. నేను మీ అమ్మాయి మాయను ఎలాగైనా సరే వెదకి మీకు వప్పగిస్తాను.

గోపా:- (కొంచెంసేపు ఆశ్చర్యంతో చూసి) అనంతం! నువ్వు నీ వంశంపేరు నిలబెట్టగలవు నాయనా! కాని, నేను ఈ విషయంలో ఎంతో ప్రయత్నించాను. నావల్ల ఏమీకాలేదు. నువ్వేంచేస్తావో! అయినా కుర్రవాడివి—ఉత్సాహం వున్నవాడివి....

అనంతం:- తప్పక మీకు వప్పగిస్తాను. మీకు తెలియదేమో—నేను డిటెక్టివును కావాలని శపథం చేసుకున్నాను. చూడండి, మీ అమ్మాయిని మూడునెలల్లో తీసుకొచ్చి వప్పగించలేకపోతే నా జమీందారీ వొదులుకుంటాను.

గోపా:-అనంతం! ఎందుకోయ్, అంతప్రతిజ్ఞ.—

అనంతం:- మరి ఏమనుకున్నారు? అనంతం మాట అంటేనే అంత! రాసి ఉంచుకోండి కావాలంటే—మూడుమాసాలు?

గోపా:- అనంతం! నీమాటవల్ల నాకు కొంచెం ఆశ కలుగుతోంది.

అనంతం:- తప్పకుండా కలుగుతుంది! చూసుకోండి, నామాట చెల్లించి తీరుతాను.

గోపా:- నాయనా అనంతం!

(ఆనందాశ్రువులతో ఆయన గొంతు గద్గదమవుతుంది. రమకూడా కళ్ళు తుడుచుకుంటుంది.)

అనంతం:- ఏడ్చి లాభంలేదు. నేను డిటెక్టివును.మీరు నా క్లయింట్లు, స్ట్రిక్ట్లీ బిజినెస్. ఇందులో ఏడుపుకు చోటులేదు. అక్కయ్యా! నువ్వు కూడా ఊరుకో.

గోపా:- రమా! వీడివల్ల అవుతుందంటావా?

రమ:- ఎందుకుకాదు మామయ్యా! (గర్వంగా) అనంతం ఇంతవరకెప్పుడూ ఫెయిల్ కాలేదు.

గోపా:- అనంతం! ఇక నీకేమిచెప్పేది! మా అమ్మాయిని గనక వప్పగిస్తే నా ఆస్తి అంతా నీదే!

అనంతం:- అలా లాభంలేదు. బిజినెస్ ఈజ్ బిజినెస్! ఫీజు వేలకి పైన నాకొక్క దమ్మిడీ అక్కర్లేదు!—సరే, ఇక అసలువిషయానికొద్దాము. మాయ తప్పిపోయినప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి. నాకు ఆ వివరా లంతగుర్తులేవు. మీరు అవి మొదటినించీ వివరంగాచెప్పండి.

(నోట్ బుక్, పెన్సిలూ తీస్తాడు. గోపాళం ఒకమాటు బుర్ర తడవుకొని మెల్లగా చెప్పుతాడు.)

గోపా:- చెప్పటాని కింకేముంది? విషయం చాలా క్లుప్తమైంది. నేనూ, మా ఆవిడా, మాయా మహాలయఅమావాశ్యకు సముద్రస్నానానికి వెళ్ళాము—

అనంతం:- ఆగండి. ఎన్నాళ్ళక్రితం?

గోపా:- పద్దానుగేళ్ళయింది.

అనంతం:- అయితే దానివయస్సు పద్దానుగూ, నాలుగూ పద్దెనిమిది అన్నమాట.

గో:- ఆఁ, బ్రతికిఉంటే.

అనంతం:- నిమ్మకళంగా బ్రతికి ఉంది. ఆ తర్వాత చెప్పండి.

గోపా:- బండిఎక్కి సముద్రానికి పోయన్నాము. బండిలో బంధ్రుతులుకూడా ఉన్నారు. బండిలో నేనూ, మీ అత్తా, మాయా. మాయ వొంటినిండా నగలున్నై! సముద్రపు వొడ్డున చాలాజనం ఉంది. పత్రికి కూడా జాస్తిగా ఉంది. బండి ఆపాము. ఈ పక్కలో ఎవడో గుంపులోనుంచి వచ్చి మాయను వాళ్ళమ్మచేతుల్లోనించి లాక్కుని మాయమైపోయాడు. మీ అత్తయ్య కెవ్వున అరిచింది. నౌకర్లు బండి మీదినించి దూకారు. పోలీసు లొచ్చారు. వాలంటీర్లు వచ్చారు. అంతా కలిసివెదికినా దొరకనేలేదు. (కొంచెంసేపు మాటలకుండా ఊరుకుని) ఆ తర్వాత ఎన్నిప్రయత్నాలుచేశాను ఆ పిల్లకోసం! మంచినీళ్ళలాగా డబ్బు ఖర్చుపెట్టాను. కాకిద్వారా కబురొచ్చినా పరుగెత్తుకుపోయాను, మన అమ్మాయేనేమో చూద్దామని—కాని—(తల తిప్పుతాడు.)

అనంతం:- సరే, పీటికికూడా సమాధానంచెప్పండి. మాయ అందమైనదా, కాదా?

గోపా:- చాలా చక్కనిది. లక్ష్మిలాగా వుంటుంది.

అనంతం:- (వ్రాసుకుని) సరే, ఆమె వొంటిమీద పుట్టుమచ్చలుగానీ, ఇంకేమైనా గుర్తులుగానీ వున్నాయా?

గోపా:- మచ్చలా: ఆ ఉన్నది. ఎడంపాదంమీద పావలాపెడల్పు ఎఱ్ఱటి మచ్చ ఒకటున్నది, కుంకంబొట్టులాగా.

అనంతం:- (రాసుకుని) చాలు. ఇక మీరునిశ్చింతంగా ఇంటికి వెళ్ళండి. నేను రేపే పట్నం పోతున్నాను. ఆతర్వాత మూడు మాసాల్లో మీ అమ్మాయి మీ ఇంటికి వస్తుంది.

గోపా:- ఆ పనిచేస్తే నాయనా, నాకున్నదంతా నీదే—

అనంతం:- చాలు,చాలు: ఆ మాటలతో లాభంలేదు. ఇరవై వేలు చాలు. బిజినెస్! ఐతే మామయ్యగారూ మీరు వెళ్ళండి. నేను ఈలోపల ప్లాన్ ఆఫ్ కాంపైన్ వేసుకోవాలి.

(గోపాళం వెళ్ళాడు. రఘుకూడా వెంట వెళ్ళుతుంది.)

అనంతం:- (కనుబొమలు ఓగించుకుని కాసేపు గంభీరంగా వుండి) నాకొక అసిస్టెంట్ కావాలి. ప్రతి డిటెక్టివుకూ ఒక వినాయకు డుంటాడు. అతని గొప్ప తనమంతా వ్రాయటానికి. నా వినాయకు డెవరూ?— దొరికాడు, దొరికాడు: గోవింద్! గోవింద్!

(గోవింద్ వస్తాడు)

గోవింద్:- చిత్తం, బాబయ్య! విరాజపురం జమీందారుగారు చిటికెల మీద వెళ్ళిపోయారు.

అనంతం:- మంచిపనిచేశాడు. సరేగాని, నువ్వు నా వినాయకుడివి.

గోవింద్:- (అర్థంకాక) చిత్తం, చిటికెలమీద—

అనంతం:- రేపు నువ్వు నావెంట మద్రాసు వస్తున్నావు. అక్కడ మనం పెద్ద ఆఫీసు పెట్టాలి, 'అనంత దుర్దశాలయం' నేను షెర్లాక్ హోమ్సుని. నువ్వు నా వాట్సన్‌వి. తెలిసిందా?

గోవింద్:- చిత్తం. చిటికెలమీద.—నేనేమి అవుతానూ?

అనంతం:- వాట్సన్! రా, నీకు తెలియజెప్పుతాను.

[తెర]

# ప్రథమాంకం

## ఒకటో దృశ్యం

(మద్రాసులో ఒక కాపురముండే ఇల్లు. ఇల్లు చిన్న బ్రాహ్మకుటుంబాలు వుంటున్నై. వారికి దోవ మధ్య రెండు కుటుంబాలలోవుండే పిల్లలు మీరా, నళినుల మీరా గది. గదిలో సామాను అంత ఖరీదుగలదికాదు! ర్చటంలో మాత్రం నిపుణత కనిపిస్తున్నది. మీరా వా కలో ప్రకటనలు చదువుతోంది. నళిని చాలా ఉదాసీన టేబిలు హార్మోనియం వాయిస్తూ పాట పాడుతోంది. శే. సాయంత్రం మూడున్నర గంటలు.)

పాట

చీకటి! దీనుల పాలిటి బాంధవి చీకటి!
మక్రమణచుమా అరుణ కిరణాల ముదమార!

మీరా:- (పత్రికనించి ముఖం పైకెత్తి) ఏమిటే నువ్వు పాడేపాట— నాకుమాత్రం చండాలంగా వుంది. చీకటి! ఉత్త చీకటి! నీ ఉద్దేశంనువ్వు చాలా దుఃఖపడుతున్నావని మాకు తెలపాలనేగా! ఇదంతా నీ పోజు!

నళిని:- (ఉదాసీనంగా ముఖం తిప్పుకుని) పోజా! మీరా! నువ్వు కూడా ఈమాటన్నావా? నా మనోవ్యథ నీకుకూడా అర్థం కాలేదా!

మీరా:- ఏమిటి నీ వ్యథ? కాస్తె చెప్పు?

నళిని:- వ్యథ చెప్పితే అర్థమవుతుందా? పాటలో దాని స్పర్శ వుంటుంది. నిట్టూర్పుల్లో అది వ్యక్తమవుతుంది. ఈ ప్రపంచంలో వ్యథ తప్ప ఇంకేముంది? కొంచెం ఆలోచించిచూడు! నేనెవర్ని? ఎక్కడ నించి వచ్చాను? రెణ్ణాళయినాక మళ్ళీ ఎక్కడికి వెళ్తాను? బహుశా ఈ జీవితంలో వ్యక్తంచేయలేని కోరికలన్నీ తీరకుండానే వుండిపోతై —

అన్నీ తీరతై. నీ జవ్వేమిటో నాకు బాగా

...మలో పడ్డావు!

...? (నిట్టూర్చి) ఎవరినీ?

...డు రాబోతూవుండెనే—ఆ భీమసేనరావుని.

...హాసంతో) భీమసేనరావునా? మీరా! నత్తివాణ్ణి ఎక్క...

...స్తారటే?

...:- ఎందుకు ప్రేమించరు? నత్తివాళ్ళు మనుషులుకారా! భీమసేన ...వు మాదిరి అందగాళ్ళు ఎంతమంది వున్నారు? అంతమాత్రం చదువుకున్నవాళ్లు ఎంతమంది దొరుకుతారు? నత్తి వున్నంతమాత్రంచేత నీ ప్రేమకుపాత్రుడు కాడనా నీ ఉద్దేశం! అతను నిన్నసలు ఎంత గాఢంగా ప్రేమిస్తున్నాడో నీకు తెలుసా?

నళిని:-ఎలా తెలుస్తుంది? అతను ఒక్కమారైనా పూర్తిగా చెప్పిలేగా!

మీరా:- మాటలేనా ముఖ్యం? ఇంతకుముందేగా నువ్వు అంటివి, వ్యథ చెప్పితే అర్థంకాదని? ఆయన మనసులోమాటకూడా సూచనలనుబట్టీ ప్రవర్తననుబట్టీ తెలుసుకోవాలి.

నళిని:- నువ్వు చూస్తే ఆయన సూచనలు, ప్రవర్తనా అంతా గ్రహించినట్టుగా వుంది! అయితే నువ్వే చేసుకోరాదూ ఆయన్ని?

మీరా:- పైకి అంటున్నావుగాని, నేను భీమసేనరావు పైన పడుకుపోతే నన్ను బతకనిస్తావా? బహుశా గొంతే పిసుకుతావు.

నళిని:- ఏమీ చెయ్యను. నాకు నత్తివాడు అక్కరలేదు.

మీరా:- ఊఁ, అక్కర్లేదూ! ఏమిటే నీ వాగుడు నెళ్లీ! నువ్వు నా ప్రాణస్నేహితురాలివయావు, అదీకాక ఆ భీమసేనరావుమీద నాకేమీ మోజులేదు—లేకపోతేనా నీ సంగతేందో బయటపెట్టించే దాన్ని!

నళిని:- నీకు భీమసేనరావుమీద ఏమీ ఆశలేదూ?

మీరా:- ఊహుఁ—నాకు ఇప్పుడున్న ఆశంతా డబ్బుమీదనే. డబ్బు ఎలా సంపాయించాలా అన్నదే ఇప్పుడు నా ప్రశ్న!

నళిని:- డబ్బు సంపాయించి ఏంచేస్తావు?

మీరా:- తల్లిదండ్రులకు సహాయపడతాను. ఇంత పెద్దదాన్నయాను ఇకనైనా వారికి సహాయపడవద్దా?

నళిని:- (కొంచెం సంకోచిస్తూ) మీరా! ఇంటో డబ్బుకు ఏమన్నా ఇబ్బందిగా ఉన్నదటే!

మీరా:- ఇబ్బం దేమీలేదు. అమ్మా నాయనా ముసలివాళ్ళయారు. నాయన ఇంకా డాక్టరుపని చేస్తున్నాడు. అమ్మ ఇంకా స్కూలులో టీచరుగా వుంది. నేను పిల్లనికాక పిల్లవాడి నయివుంటే ఇదివరకు నేను వారిభారం వహించవలసి వచ్చేది! కాని స్త్రీనై పుట్టానుగదా అని ఏమీ చేయకండా చేతులు ముడుచుకు కూచోమంటావా? ఊహుఁ. నేను ఉద్యోగం చేయటానికి నిశ్చయించుకున్నాను. కనీసం అమ్మకన్నా విశ్రాంతి ఇస్తాను.

నళిని:-కాని, నీకు నౌకరి ఎక్కడ దొరుకుతుంది? ఈ రోజుల్లో మగవాళ్ళకే దొరకటం లేదు.

మీరా:- అందుకనేగా రాత్రింబగళ్ళు ప్రకటన్లు చూస్తున్నది. ఇదిగో చూడు 'కాలకేతు'లో ప్రకటనవున్నది. ఒక డిటెక్టివుకు టైపిస్టు కావాలట. రేపుపోయి చూద్దామనుకుంటున్నాను.

నళిని:- డిటెక్టివు ఆఫీసులో నౌకరిచేస్తావా?

మీరా:- ఏం చేస్తే? డిటెక్టివు నన్నేమన్నా తింటాడా?

నళిని:- ఊహుఁ. అది కాదు. ఆపేరు వింటేనే నాకు ఎలానో వుంటుంది!

మీరా:-నీదంతా విచిత్రమే! దేంటోనూ నీకు మంచే కనపడదు! ఆఖరికి ప్రేమలోపడి దాన్ని గోల చేస్తుంటివి!

నళిని:- ఎవరు ప్రేమలో పడింది?

మీరా:- నువ్వే. ఇంకెవరూ?

నళిని:- మీరా! నువ్వు భలే నవ్వించావే। నత్తివాణ్ణి ఎక్కడన్నా ప్రేమిస్తారటే?

మీరా:- నాదగ్గర వగలుపోమాకు నెల్లీ। జుట్టుపట్టుకుని అసలు సంగతి నీచేత కక్కిస్తాను. ఇక చాలించు. భీమసేనరావు వచ్చేవేళ అయింది. మంచిపాట ఒకటి మొదలుపెట్టు.

నళిని:- వల్ల కాదమ్మా! (లేస్తుంది)

మీరా:-వల్ల కాదూ? పాపం! సిగ్గొచ్చిందనుకుంటా! సరే, నీ బదులు నేనే పాడతానులే—

(హార్మోనియం ముందుకూచుని మెల్లగా నొక్కుతూ)

ఏం పాడమంటావు?....సరే ఒక మిళనగీతం పాడతాను.

(పాడుతుంది. పాట పూర్తి అవుతుండగా భీమసేనరావు వస్తాడు)

భీమ:- న న న నమస్కారం!

మీరా:- రండి, భీమసేనరావుగారూ।....కూచోండి। ఆ కుర్చీలో కూచోకూడదూ!

(నళిని పక్క కుర్చీ చూపుతుంది)

భీమ:- ఆఁ. అదే. (కుర్చీకొసను కూచుని దగ్గి గొంతు సవరించుకుని) మె మె మెట్లెక్కుతుండగా ప ప పాట వినపడింది. ఆ ప ప పాడేది న న న నళినీ దేవిగారేనా?

మీరా:-(తొందరగా) ఆఁ। నేను వాయించాను. నళిని పాడింది. ఎలావుంది?

భీమ:- అ అ అద్భుతంగా। ఇలాంటి గొంతు నే నిదివరకు వినలేదు.

(మీరా నోటికి గుడ్డ అడ్డం పెట్టుకుంది)

నళిని:- (హఠాత్తుగా లేచి) నేను వెళ్ళుతున్నాను.

మీరా:- (బెదరిస్తూ) జాగర్త నెల్లీ! చంపి పారేస్తాను। ఇంత అసూయా నీకు? నా పొగడ్త కాస్తైకూడా వినలేవూ? (నళిని కూర్చో

బడుతుంది) భీమసేనరావుగారూ ! మీరు చాలా బాగా పాడతారని విన్నాను. ఇవ్వాళ మీపాట మాకు వినిపించక తప్పదు ?

భీమ:- (భయపడుతూ) నె నె నేను ప ప పాట పాడేదా! అంతకంటే న న నాగొంతు కోయరాదూ ?

మీరా:- నిజంగా మీకు సంగీతం రాదూ ?

భీమ:- ఎప్పుడూ ప్రయత్నించలేదు. మ మ మాట్లాడటమే నాకు గగన.... (మిగతాది చేత్తో పూరిస్తాడు)

మీరా:- ఏం, మీరు మహాచక్కగా మాట్లాడతారే!

భీమ:- ఆఁ! చక్కగా మాట్లాడతానా ? ఏదీ, ఆ సంగతే నాకు తెలియదు! నళినీదేవిగారూ మీరు గమనించారా ఇది ?

(నళిని మాట్లాడదు)

అదుగో చూడండి! నళినీదేవిగారు మనసులో మాటబయటపెట్టటంలేదు.

మీరా:- (పెదాలు బిగించి నవ్వి) నళినీదేవికి మనసులోమాట దాచుకోవటం చాలా ఇష్టం. అయితే అవుసరం వచ్చినప్పుడు దాని అంతట అదే బయటపడుతుంది లెండి. సరే, మీ రొకమాటు మమ్మల్ని షికారుకు తీసుకెళ్లతామన్నారు. ఆ మాటే మరిచిపోయారా ?

భీమ:- మ మ మరవలేదు. అ అ అడగటానికి ధైర్యంలేక ఊరుకున్నాను. (నళినితో) వ వ వస్తారా, ఇవ్వాళ ? రండి వెళ్దాము.

నళిని:- మీరా! నువ్వు పోవే. నా కివ్వాళ వొంటో....

మీరా:-బాగుందే! వారు నన్ను పిలవనుకూడా లేదు. నేను పోయేదా! ఇక నిన్ను ఇంతగా బతిమాలుతుంటే నువ్వు రావా ? మహ బాగుంది!

భీమ:- లేదు, లేదు - నే నిద్దర్నీ పిలుస్తున్నాను. అంటే మీలో ఎవ్వరు రాకపోయినా నాకు కష్టంగానే వుంటుంది.

మీరా:- నళిని ఒక్కతే వచ్చినా మీకు కష్టంగా వుంటుందా ?

భీమ:-అంటే.... (తల గోక్కుని) కొ కొ కొంచెం కష్టంగానే వుంటుంది.

మీరా:- (నవ్వి) అది లౌకికంగా చూపే బాధ!....అయితే నెల్లీ నువ్వు త్వరగా గుడ్డలు మార్చుకురా.

నళిని:- సరే. (వెళ్తుంది)

మీరా:- ఎక్కడికి వెళ్దాము ?

(మీరా వచ్చి, నళిని కుర్చీలో కూర్చుంటుంది)

భీమ:- మి మి మీరు ఎక్కడికి పోదామంటే అక్కడికే. బి బి బీచికిపోదామా! అక్కడినించి సినిమాచూసి....

మీరా:- ఉహుఁ. ప్రొద్దుకూకినాక బయట తిరుగుతుంటే మా అమ్మా నాయనా ఊరుకోరు. ఆలోపలే తిరిగిరావాలి.

భీమ:- (మీరా వేపుకు వంగి) చూడండి, మి మీరాదేవిగారూ! మీరు నా మనోభావం అర్థంచేసుకున్నట్టు ఉన్నారు....అంటే, న న నళినీదేవిని నేను.... (గొంతు సవరించుకుని, దగ్గి) ఈ సందర్భంలో నేను మీ సహాయం ఆపేక్షించవచ్చునా ? అంటే మ మ మధ్యమధ్య మీరు—

మీరా:- అదుగో! మా అమ్మ వస్తున్నట్టుంది. ఈ విషయమై మీతో తర్వాత మాట్లాడతాను. బహుశా ఇవ్వాళే బీచిలో మాట్లాడుకోవచ్చు ననుకుంటాను.

(శారదాంబ వస్తుంది.)

మీరా:-అమ్మా! భీమసేనరావుగారు ఇవ్వాళ నన్నూ, నళినిని షికారుకు తీసుకువెళ్తామంటున్నారు.

భీమ:-(నమస్కరించి) ఏదో కొంచెం గాలికి—

శారదాంబ:- మంచిది. నాయనా! అలాగే పోయిరండి. (కూచుని) కులాసాగా ఉన్నావా నాయనా!

భీమ:- చిత్తం. నాది రాయిలాంటి శరీరం. మొ మొన్ననే ముష్టి యుద్ధంలో తె తె తెల్లవాణ్ణి చిత్తుచేశాను. నా కేజబ్బూరాదు.

శారదాంబ:- వ్యాపారం బాగా సాగుతున్నదా ?

భీమ:- ఫర్వాలేదు. ఈ మధ్యనే పెద్ద కంట్రాక్టు ఒకటి సంపాయించాను. బాగా గిట్టుబాటుకూడా కావచ్చు.

(రామమూర్తి ప్రవేశం)

రామమూర్తి:- అరే, భీమసేనరావే! కులాసా ?

భీమ:- (నమస్కరిస్తూ) చిత్తం.

మీరా:- నాన్నా! నేను వీరివెంట షికారుకు పోతున్నాను.

రామమూర్తి:- మంచిది. పెందళాడే తిరిగిరా.

భీమ:- చిత్తం. నేను పొ పొ పొద్దుకూకకముందే ఇంటికి తీసుకొచ్చి వొదిలిపెడతాను.

(నళిని దుస్తులు మార్చుకుని వస్తుంది. ఇద్దరూ చాలాకొద్దిగా మాట్లాడుకుంటారు. ఈలోపల మీరా గదిలోకివెళ్ళి దుస్తులు మార్చుకు వస్తుంది.)

మీరా:- ఐతే పదండి. ఇంకా ఆలస్యంచెయ్యడం ఎందుకు? (తల్లితో దగ్గరగా) అమ్మా! టికి అన్నీ తయారుచేశాను. నాయనకు టీ ఇవ్వు. ఏం?

[illegible]:- (ప్రేమతో) అలాగేనండి! నేను మీరుచెప్పిన పని నెరవేరుస్తాను. మీరు షికారుచేసిరండి!

మీరా:- (తండ్రితో మెల్లగా) నాయనా! నీకొరకు కొత్తరకం పిండి వంట చేశాను. అమ్మనడిగి పెట్టించుకో.

రా:- (నవ్వుతూ) అలాగే! మీరు టీ తీసుకోలేదా ?

మీరా:- మేము మళ్ళీవచ్చి తీసుకుంటాము.

(మీరా, నళిని, భీమసేనరావూ వెళ్ళిపోతారు)

రా:- (కుతూహలంతో) ఏమే, భీమసేనరావు మన మీరాని—?

[illegible]:- ఉహుం. నళినిని.

రా:- ([illegible]ట్టూర్చి) పోనీ! నాకు భయమేసింది.

[illegible]:- అసలు మీరాదృష్టి అటుమళ్ళనేలేదు.

[illegible]:- (ముఖం నల్లబడుతుంది) కాని, ఏదో ఒకరోజున అటు మళ్ళకం[illegible] వుండదుగా? హఠాత్తుగా ఒకరోజున ఎవడో ఒక కుర్రవాడొచ్చి ప[illegible]గ్గరనించి తన్నుకుపోతాడు. అప్పుడు మనం ఏంచేస్తాం?

(ఇద్దరూ మాట్లాడకండా కూచుంటారు.)

## రెండో దృశ్యం

(మద్రాసులో అనంతం ఆఫీసు. కొత్త ఫర్నిచరుతో గది అలంకరించి వుంటుంది. ఒక సోఫాసెట్టుకూడా వుంది. గదిలో ఒకమూల చిన్న టేబిలుమీద టైపురైటరు వుంది. మధ్యను సెక్రటేరియట్ టేబిల్ ముందు అనంతం కూచునివుంటాడు. పక్కని గోవిందు నుంచునివుంటాడు. వేళ మధ్యాహ్నం.)

అనంతం:- చూడు గోవిందూ! ఛద్మవేషం లేకుండా డిటెక్టివ్ కాబోవటమంత వేస్టు మరోటిలేదు.

గోవిందు:- యదార్థం సెలవిచ్చారు. మిమ్మల్ని చూస్తే డిటెక్టివని ఏ వెధవా అనుకోడు! జమీందారుగారి బిడ్డ అనుకుంటాడు.

అనంతం:- నాకీ సంగతే ఇంతవరకు బుర్రకు తట్టలేదు. అంచేతే ఇన్నాళ్ళూ మాయను పట్టలేకపోయాను. ఇవ్వాళే మెరుపులాగా తట్టింది—ఛద్మవేషం వేయంది డిటెక్టివు కాలేడని. నిజానికి ఆలోచిస్తే ఈ ప్రపంచంలోని పెద్దపెద్ద డిటెక్టివులంతా ఎప్పుడూ ఛద్మవేషంతోటే వుండేవారని తోస్తుంది।

గోవిందు:- చిత్తం. ఆ మాట వేరే చెప్పాలా? అసలు వాళ్ళు ఛద్మవేషంతోటే పుట్టుకొచ్చి వుంటారని నా నమ్మకం!

అనంతం:- నాకంత నమ్మకంలేదు....సరే, నాకీ ఆలోచన తట్టగానే కావలసిన సరంజామా అంతా కొనుక్కువచ్చాను. ఇప్పటికి నాకు కావలసిన డిటెక్టివు హంగులన్నీ అమరినై.

గోవిందు:- ఇంకేం! ఇక జమీందారుగారి అమ్మాయిని చిటికెలమీద పట్టేసేయండి.

అనంతం:- తప్పకుండా। జమీందారుగారి అమ్మాయినేంటి— ఛద్మవేషంతో పెద్దపెద్ద గజదొంగల్ని పట్టేస్తాను. (డ్రాయరులాగి [illegible]ం తీసి) ఇదీ నా బ్రహ్మాస్త్రం! ఛద్మవేషం వేయాలంటే ఏం చేయాలో [illegible]?

గోవిందు:- చిత్తం. ఎందుకు తెలియదు! ముఖానికి మసీ, గిసీ పూసు కోవాలి. పగటివేషగాళ్లు అదేగా చేసేది?

అనంతం:- గోవిందూ! నువ్వు దున్నపోతువి—సరిగా డాక్టర్ వాట్సన్‌మాదిరే—సరే, నేను చెప్తాను విను—ఛద్మవేషానికి కావలసింది మూరెడు గడ్డం, నల్ల కళ్ళజోడూ, కనుబొమ్మలూ!

గోవిందు:- (ఆశ్చర్యంతో) నల్ల కళ్ళజోడూ, మూరెడు గడ్డమూ—కనుబొమ్మలూనా?

అనంతం:- ఆఁ. అంతే! ముఖమంతా మారిపోతుంది. ఇదుగో చూడు! (వేషం తగిలించుకుని) చూశావా? మొహం మారిందా లేదా?

గోవిందు:- (చాలా ఆశ్చర్యంతో) చిత్తం, చిటికెలమీద మారి పోయారు. అచ్చగా పెదబాబుగారిలాగా వున్నారు. వారికి గడ్డమూ, కను బొమలూ ఇలాగే వుండేవి.

అనంతం:- (తృప్తిపడి) ఏమంటావూ! ముసలివాడిలాగా కనిపిస్తు న్నాననా?

గోవిందు:- చిత్తం. ముప్ఫయియేళ్ళకి పైనే కనిపిస్తున్నారు.

అనంతం: రైట్! ఇవ్వాళ ఈ వేషంతోటే మహామాయను వెతక టానికి పోతున్నాను; ఎలాగో ఈపని సాధించంది వదలను. గోవింద్! మోటరు బయటికి తియ్యి.

గోవిందు:- చిత్తం. ఇవ్వాళ మనం ఎటూ వెతకటానికి పోయేది?

అనంతం:- (ఆలోచించి) బీచికిపోదాము.... లక్ష్మివిగ్రహంలాంటి పిల్ల, కాలిని ఎర్రపుట్టుమచ్చ, పద్దెనిమిదేళ్ళు—దొరకాలంటే బీచివొడ్డున దొరకవలసిందే! పీపుల్సుపార్కు లాభంలేదు—నే నిన్నాళ్ళూ అటు వృథాగా తిరిగాను; ఒక్కతెకూడా లక్ష్మిలాంటి పిల్ల కనిపించలేదు.

గోవిందు:-యధార్థం! లక్ష్మిలాంటి పిల్ల పీపుల్సుపార్కుకు అసలు పోనే పోదు.

అనంతం:- సరే! నువ్వుపోయి కారుతియ్యి. నాలుగైంది—ఇదే మంచిసమయం.

గోవిందు:- చిత్తం! (వెళ్తాడు)

అనంతం:- (పైపు నింపుకుంటూ, ఆఫీసు నాలుగువేపులా చూసి) ఆఫీసు చక్కగా కుదిరింది. రెండో అంతస్తూ, చుట్టూ ఎవరిళ్ళూలేవూ, పైగా పేరుకూడా మంచిది తట్టింది—"అనంత దుర్దశాలయం!" నిజానికి షెర్లాకు హోమ్సుచూసినా అసూయపడతాడు! ఇంకా క్లయింట్లు ఎవరూ రాకపోయినా ఇకరావటం మొదలుపెడతారు. బ్రహ్మాండమంత రహస్యాలనైనాసరే బద్దలుకొట్టి తీరాలి. టైపిస్టు సెక్రటరీకోసం ప్రకటనచేశాను. రేపు వాళ్ళు ఇంటర్వ్యూకు వస్తారు. ఒక్కమాంచి దిట్టమైన నడికారు ఆంగ్లోఇండియన్ స్త్రీనిచూసి నిర్ణయిస్తాను. కుర్రవాళ్ళు లాభంలేదు. వాళ్ళు సరసాలకు తప్పితే పనికిరారు. (క్రింద మోటారు హారన్ వినిపిస్తుంది.) అలాంటి సరసాలు మనదగ్గిర పనికిరావు! ఇక్కడి పని చాలా గురుతరమైంది—ప్రాణాలతో చెరలాట! దొంగలు, దోపిడిగాళ్ళు, హంతకులు—

(పైపు వెలిగించుకుని వెళ్ళిపోతాడు)

## మూడవ దృశ్యం

(బీచి. మీరా, భీమసేనరావు పక్కపక్కని నడుస్తూ వుంటారు)

మీరా:- నెల్లీ ఎక్కడా ?

భీమ:- ఆమె అక్కడ బెంచీమీద కూచుంది. ఈలోపున, మి మి మిస్ మీరా, నాగొడవ కాస్తె చెప్పుకుంటాను. చూడండి, నాస్థితి చాలా దు దు దుర్భరమైంది. న న నళిన్ని గురించి తప్ప వేరే ఏమీ ఆలోచించలేకుండా వున్నాను. రాత్రి నిద్రపట్టదు. కళ్ళుతెరుచుకు చూస్తూ పడుకుంటాను. చూడండి, ఇక ఆమె నాసంగతి ఏమీ పట్టించుకోదు. నేనంటే అసహ్యమేమోనని నా అనుమానం. మీకు లేదనుకుంటాను, కాని—

మీరా:- నళినికి మీరంటే అసహ్యమని మీకెట్లా తెలుసు ?

భీమ:- మరి, నన నన్ను చూడగానే మొహం విచారంగా పెడుతుంది. పదిమాటలకు ఒక్కమాటకూడా జవాబు—

మీరా:- (నవ్వుతూ) దీనికి మీరేమీ భయపడకండి. నళిని స్వభావమే అంత. తన కిష్టమైన వస్తువు తనకు అక్కరనే లేదన్నట్టు పోజు పెట్టుతుంది.

భీమ:- అలాగా ? అయితే నామీద ఆమెకు—

మీరా:-అయిష్టమేమీలేదు. కాని మీరుకూడా మీ మనోభావాన్ని ఆమెకు స్పష్టంగా చెప్పటం మంచిది.

భీమ:- (నిరాశతో) ఎ ఎ ఏంచేసేది మిస్ మీరాదేవీ। కొంచెం ఆవేశం వస్తే చాలు నోటినించి మాటేరాదు.

మీరా:- మాటద్వారా కాకపోతేనేం ? ఇక మగవాళ్ళు తమ అనురాగం వేరే విధంగా వెల్లడించలేరా? భీమసేనరావుగారూ మీరు చదువుకున్న వారు; ఇంజనీయర్లు ; ఈ మామూలు ఆటంకాన్ని దాటలేరా?

భీమ:- మీ కిది చాలా సులభంగా కనిపించవచ్చు గాని నాకుమాత్రం లంక దాటటమే! ఏదైనా ఆపదన్నా వస్తే అడ్డుపడి కొంచెం కృతజ్ఞత సంపాయించ వచ్చు——ఈ మద్రాసులో అలాంటి దేదీరాదుకదా।

(ఈ మాటలు మాట్లాడుకుంటూ ఇద్దరూ వెళ్ళిపోతారు)

సీను మార్పు

(వీధిలో ఇంకో భాగం. అనంతం కారు రోడ్డుమీద ఆపి, లోపల నుంచి ఛద్మవేషంతో దిగుతాడు)

అనంతం:- గోవింద్ ! నువ్వు బండిలోనే కూచో; నేను వెతకటానికి పోతున్నాను.

గోవింద్:- చిత్తం !

అనంతం:- చూడు, నువ్వుకూడా రోడ్డువంక చూస్తూవుండు, లక్ష్మి లాంటి పిల్ల ఎవరన్నా కనపడతారేమో.

గోవింద్:- చిత్తం!

అనంతం:- పద్దెనిమిదేళ్లే వుండాలి. ఇదిమాత్రం బాగా గుర్తుపెట్టుకో!

గోవింద్ :- చిత్తం! మరి పందొమ్మిదే ళ్ళుంటేనో ?

అనంతం:- చూడనే అక్కర్లేదు! (వెళ్ళిపోతాడు)

(సీను మార్పు)

(వీధిలో ఇంకో భాగం. ఎవ్వరూ వుండరు. నళిని ఒక్కతే బెంచీ మీద కూచుని వుంటుంది)

నళిని:-ఆ ఇద్దరూ మాట్లాడుకుంటూ వెళ్ళిపోయారు—నా కళ్ళముందే! (నిట్టూర్పు) నేను రాకపోతేనే బాగుండేది! ఏకాకిని, ఏకాకిని! ఈ ప్రపంచంలో నాకు నా అనేవారు లేరు! చుట్టాలు లేరు! మిత్రులు లేరు! (అనంతం వెనకవచ్చి నుంచుంటాడు) అంతా వంచన! ఈ ప్రపంచమంతా ఒక ఎడారి. అమ్మ లేదు, నాయన లేదు—

అనంతం:- అందరూ వున్నారు!

(అనంతం బెంచీమీదికి వచ్చి కూచుంటాడు. నళిని విస్తుపోయి కొంచెం పక్కకు జరుగుతుంది)

అనంతం:- తల్లీ వున్నది, తండ్రీ వున్నాడు—ఎక్కడవున్నదీమాత్రం మీకు తెలియదు. కావాలంటే ఇతడు చెప్పగలడు!

(గుండె చరుచుకుంటాడు)

నళిని:- (శంకిస్తూ) ఎవరు మీరు? ఏం కావాలి?

అనంతం:- ఏమీ అక్కర్లేదు. మీరు ఎవరో నేను ఎరుగుదును. మీ పేరు చెప్పమంటారా? మాయాదేవి!

నళిని:- నాపే రదికాదు. మీరు పొరపడుతున్నారు.

అనంతం:- పొరపాటా! (నవ్వి) నే నెప్పుడూ పొరపడను. మీకు వయసు పద్దెనిమిది సంవత్సరాలు కాదూ? (నళిని భయంతో నాలుగు దిక్కులా చూస్తుంది) రైట్! ఏదీ మీరు బూటుకూడా కొంచెం విడవండి, చూద్దాము!

నళిని:- (లేచి భయంతో) ఆఁ! ఏమిటీగోల? భీమసేనరావుగారూ! భీమసేనరావుగారూ!

భీమ:- (దూరాన్నుంచి) వస్తున్నా!

అనంతం:- అదా! గల్లంతు చేశావే! పోలీసుల్ని పిలుస్తావేమిటి?

(భీమసేనరావూ, మీరా పరుగెత్తుకుంటూ వస్తారు)

భీమ:- ఎ ఎ ఏమిటి?

నళిని:- (భీమసేనరావు చెయ్యి గట్టిగాపట్టుకుని) ఆ మనిషి నాబూటు విప్పదీయమన్నాడు.

భీమ:- (గుప్పిటి బిగబట్టి) ఏమిటి? (అనంతం పరుగుతీస్తాడు) ఇవ్వాళ ముండాకొడుకు పనిపడతాను. (వెంట పడతాడు)

నళిని:- భీమసేనరావు వెళ్ళిపోయాడే మీరా!

మీరా:- పద, మనంకూడా అటేపోదాము.

(ఇద్దరూ చేతులుపట్టుకుని పరుగెత్తుతారు)

సీను మార్పు

(అనంతం కారు, ఫుట్ బోర్డుమీద గోవిందు కూచునివుంటాడు)

గోవిందు:- పద్దెనిమిదేళ్ళ లక్ష్మీవిగ్రహం ఈ ప్రాంతాల ఒక్కటె కూడా లేదనుకుంటాను. నలభైయేళ్ళ తాటకిమాత్రం ఒకతె ఇటుపోయింది.

(పరుగెత్తుకుంటూ అనంతం వస్తాడు)

అనంతం:- గోవింద్! బండి వెంటనే స్టార్టుచెయ్యి! వెంటపడుతున్నారు.

గోవింద్:- ఎవరు, లక్ష్మివిగ్రహమా?

అనంతం:- ఒక్క లక్ష్మివిగ్రహమే కాదు. వెంట నారసింహుడు కూడా వున్నాడు....

గోవింద్:— అలాగే! అయితే చిటికెలమీద........

(హాండిల్ వేసి బండి స్టార్ట్ చేస్తాడు. బండి స్టార్ట్ కాదు.)

అనంతం:- అదుగో, నారసింహుడు రానేవచ్చాడు! ఇవ్వాళ దొక్క చీల్చింది వదలడేమో!

గోవిందు:- బాబూ! నాకు భలే ఆలోచన తట్టింది.

అనంతం:- చెప్పు, త్వరగా! వాడు వచ్చి పడనేపడ్డాడు.

గోవింద్:- ఆ గడ్డం, కనుబొమలూ తీసి నాకివ్వండి—వాడు గుర్తుపట్టలేడు.

అనంతం:- భలే ఉపాయం!

(అనంతం గడ్డం, కనుబొమ్మలూ తీసిఇస్తాడు. గోవిందు వాటిని తగిలించుకుంటాడు. భీమసేనరావు పరుగెత్తుకుంటూ వస్తాడు. వెంట మీరా, నళినీకూడా వస్తారు)

భీమ:- (అనంతంతో) ఎ ఎ ఎటుయాపోయాడో చూశారా?

అనంతం:- ఎవరండీ?

భీమ:- పొడుగాటి గడ్డం, నల్లకళ్ళజోడూ ఉన్నై. ఇటు వచ్చాడా?

అనంతం:- లేదే, ఇటు అలాంటి వాడెవడూ రాలేదు.

భీమ:- అయితే మరెటు పోయాడూ?

అనంతం:- నాకేం తెలుసు? మీవెంట స్త్రీలుకూడా వున్నారు. ఏమైనా ఆపదలోవున్నారా?

భీమ:- ఆపద ఏమీలేదు! ఉంటే వాడికే వుంటుంది, నా చేతికి దొరికితే!

(వెతకటానికి పోతాడు)

నళిని:- (మీరాతో) చూడవే! ఆ మనిషి గడ్డంకూడా సరిగ్గా అట్లానే వుంది.

(గోవిందుని చూపుతుంది)

అనంతం:- (దగ్గరపోయి నమస్కరించి) వేరుగా భావించకండి. మీరేమైనా నా డ్రైవర్ను సందేహిస్తున్నారా?

మీరా:-మీ డ్రైవరుగడ్డం సరిగ్గా అట్లాగే వున్నదని ఈమె అంటున్నది.

అనంతం:- (గోవిందుని పిలిచి) గోవింద్! నీ గడ్డం సరిగ్గా అట్లాగే ఎందుకున్నదీ?

గోవింద్:- చిత్తం! నా గడ్డం ఎట్లా వుందీ!

అనంతం:- (గద్దిస్తూ) ఎట్లాగన్నా వుండనీ. నీ గడ్డంచూసి వీరికి సందేహం కలిగింది.

గోవింద్:- చిత్తం! సందేహించ దగినపని ఏదీ నా గడ్డంచెయ్యలేదే?

అనంతం:- చెయ్యకపోవచ్చు. మర్యాదస్తులైన స్త్రీలు సందేహించారు కాబట్టి నీవు ఇవ్వాళే దాన్ని గొరిగించివెయ్యి.

గోవింద్:- చిత్తం—

(మీరా, నళినులు దీనికి నవ్వుతారు)

భీమ:- (తిరిగివచ్చి) ఉహూఁ. పారిపోయాడు. కాని ఎక్కడికి పోతాడు? ఎ ఎ ఎక్కడైనా దాక్కోనీ వెతికి పడతాను. ఆ తర్వాత— (నళినీ మీరాలతో) రండి. (అనంతంతో) అయితే మీరుచూడనట్టేకదూ?

అనంతం:- ఉహుఁ.

భీమ:- న న నమస్కారం!

(మీరా నళినులను తీసుకుని వెళ్ళిపోతాడు. అనంతం అటేచూస్తూ వుండి పోతాడు)

[తెర]

# ద్వితీయాంకము

## ఒకటో దృశ్యం

(అనంతం ఆఫీసు, పదిగంటలవేళ. అనంతం ఒక్కడే గదిలో పచారుచేస్తూ ఉంటాడు)

అనంతం:- నా ఘట్టినమ్మకం, ఆపిల్లే మాయ అని. లేకపోతే బూటు ఎందుకు విప్పలేదూ? ఇందులో పెద్ద కుట్ర ఏదో ఉంది! ఈ రహస్యాన్ని భేదించి తీరవలసిందే.... పోతే ఆ రెండోపిల్ల! ఆ ముఖంలో ఎంత కొంటెతనముంది? ఎంతచక్కగా నవ్వింది! పరిచయం అడగ లేదు.... వెంట ఆ రాక్షసుడున్నాడుగా, సరిగా మాట్లాడటానికే చోటివ్వ లేదు!.... లాభంలేదు. వెతికి వాళ్ళజాడా తీయవలసిందే. నేను డిటెక్టివుని.... మామూలు చిరునామా కనుక్కోలేకపోతానా? తప్పకుండా కనుక్కుంటాను.

(గోవిందు వస్తాడు)

గోవిందు:- చిత్తం! ఆయన వొచ్చాడు.

అనంతం:- ఆయనా? ఎవడాయనా?

గోవిందు:- చిత్తం నిన్నటి ఆ నత్తి ఆయన.

అనంతం:- నత్తాయనా! అంటే, ఆ నారసింహుడేనా?

(గోవిందు తల ఆడిస్తాడు.)

అయితే కొంపమునిగింది! ఏమి కావాలంటాడు, ఆ రౌడీవెధవ?

గోవిందు:- ~~అనంతం~~:- ఏమో బాబూ! ఏం చెప్పటంలేదు. నన్ను చూడగానే గుర్తు పట్టాడు. నావంక పరీక్షగాచూసి నీగడ్డమేదీ? అన్నాడు. నేను చెప్పేశాను, అమ్మగారికి అనుమానంవేస్తే తీసివేయించానని.

అనంతం:- అయితే వాడు కనుక్కున్నాడన్నమాట? గోవిందూ! నీకు పుణ్యముంటుంది. పోయి నేను ఇంటోలేననో, లేక నిద్రపోతున్నాననో,

కాదంటే చచ్చిపోయినాననో ఏదో ఒకటి చెప్పి వాణ్ణి ఇక్కణ్ణించి పంపించు.

గోవిందు:- చిత్తం— (వెళ్లబోతాడు)

అనంతం:- కాని—వాడిదగ్గరినించి ఆపిల్ల అడ్రసు కనుక్కో వచ్చునే. పిలిచిచూస్తే ! ఏం, గుర్తుపట్టితేమాత్రం ? గోవింద్ ! ఆయన్ని పిలుచుకు రా.

గోవిందు:- (సంకోచించి) చిత్తం, చిటికెలమీద తెస్తాను.

అనంతం:- ఆఁ, చిటికెలమీద హాజరుపెట్టు. (గోవిందు వెళ్ళిపోతాడు) ఆవ్యక్తి వాళ్ళకేదో చుట్టమై ఉంటాడు—బహుశా అన్న అయినాకావచ్చు. అన్నా ? ఉహుఁ—అన్నలాగాలేదువాడిముఖం. మరి—?

(భీమసేనరావు వస్తాడు.)

భీమ:- న న నమస్కారం !

అనంతం:- నమస్కారం—దయచేయండి.

భీమ:- మీరు డిటెక్టివులని నిన్నఎందుకు చెప్పలేదూ? (కూచుంటాడు)

అనంతం:- చాలా కొద్ది పరిచయం కావటాన అవసరమనుకోలేదు— మీకూడా మీరు పరిచయం ఇవ్వలేదు కదా.

భీమ:- హుఁ. నేనుకూడా అ అ అవసరమనుకోలేదు.

అనంతం:- మీరు బహుశా ఆస్త్రీల అన్న అనుకుంటాను, అవునా ?

భీమ:- ఉహుఁ. నేను ఏ ఇ ఇస్త్రీకీ అన్నను కాను. వారిద్దరిలో ఒకామె—పోనివ్వండి ఆసంగతి. నేను మి మి మీతో ఒక పనిఉండి వచ్చాను. మి మి మీరేకదూ 'అనంత దుర్దశాలయం' డిటెక్టివులు ?

అనంతం:- ఆ.

భీమ:- అయితే వినండి. నిన్న నేను ఆయిద్దరి స్త్రీలనూ తీసుకుని గీచివాడ్డుకు షికారెళ్ళాను. ఒకడు ఎవడో—దొంగముండాకొడుకు— ఙలో ఒకామె బూటువిప్పమని వెంటపడ్డాడు. వాడుకావాలి నాకు!

మీరు వాణ్ణివెతికి నాకు పట్టి ఇస్తారా ?

అనంతం:- (ఆలోచించి) అయితే ఆ వొంటరిగా కూర్చున్నయువతి-అంటే బూటువిప్పమని కోరబడినావిడ—ఆమేనా మీ 'ఇద్దరిలోఒకామె ?'

భీమ:- ఆ వివరాలు మీ కెందుకూ ?

అనంతం:- ఏమీలేదు, ఊరకనే అడిగాను. డిటెక్టివులు, నిజానికి అన్నీ తెలుసుకోవాలి. ఆ రెండో యువతి, గులాబిరంగు చీరెకట్టుకున్నావిడె— ?

భీమ:- చు చు చూడండి. నేనా ఇ ఇస్త్రీల సంగతులు మీకు చెప్పటానికి రాలేదు. న న నాకు ఆ రాస్కెల్ కావాలి. మీరు పట్టివ్వగలరో లేరో నాకు చెప్పండి.

అనంతం:- చూడండి మిస్టర్—

భీమ:- రావ్ ! భీమసేన రావు !

అనంతం:- చూడండి మిస్టర్ రావ్ ! నే నిలాంటి చిన్నచిన్న కేసులు, అంటే చెప్పుల దొంగతనాలు, పట్టను—

భీమ:- (లేచినుంచుని) చిన్న కేసా ! ఒక స్త్రీని అవమానించటం చిన్నికేసా ! నీవెలాంటి పెద్దమనిషివయ్యా ?

అనంతం:- సరే. నేను వాణ్ణి మీకు పట్టిఇచ్చాననే అనుకోండి, మీరేం చేస్తారు ?

భీమ:- ఏంచేస్తానా ? పొడి పొడి చేస్తాను. ముందు మొహంమీద ఒకటిస్తాను. తర్వాత పొట్టలో ఒకటి తంతాను—ఆ తర్వాత జుట్టు పట్టుకుని....

అనంతం:- ఓం.....ఇలాంటి రాక్షసకృత్యాలకు నేను సహాయపడలేను. క్షమించండి.

భీమ:- చేయరన్నమాట ?

అనంతం:- ఉహుం.

భీమ:- అయితే నువ్వు పిల్ల డిటెక్టివ్వు— కాన్‌స్టేబుల్‌వు ?

అనంతం:- చూడండి. మీరంత అసహ్యంగా మాట్లాడకూడదు. ఒంటో బలముంటే మాత్రం—

భీమ:- పో ! అసలు నువ్వు కాన్‌స్టేబుల్‌వుకూడా కాదు, మోతాదువి !

(వెళ్ళిపోతాడు)

అనంతం:- (కొంచెం సేపు పచారుచేసి శాంతిపడినాక) ఇందులో ఏదో పెద్ద రహస్యముంది. ఈ నత్తివాడు వాళ్ళకు రక్షకుడై వుండాలి. లేకపోతే పరిచయం ఎందుకివ్వడు ? (నవ్వి) ఏం తెలివి ! నా దగ్గరకే వచ్చాడు వాడిని పట్టివ్వమని ; కాని—వేరే ఇంకో ఉద్దేశం లేదుగదా ! (ఆలోచించి) ఓ, ఇప్పటికి అర్థమయింది ! ఈ నత్తివాడు దొంగ ; గజదొంగ—అసలు ఆపిల్లే మాయ ! మాయను పెళ్ళిచేసుకుని గోపాలయ్య జమీందారీ అంతా కాజెయ్యాలని వీడు ప్లానువేశాడు. అబ్బ ! ఎంతపెద్ద కుట్ర !....అయితే మరి నా దగ్గిరికెందుకు వచ్చినట్టు ? బహుశా, నేను మాయను వెతకటానికి ఇక్కడికొచ్చిన సంగతి తెలిసివుంటుంది— అంచేతనే ఆ ఆరా తీయటానికి వచ్చివుంటాడు ...ఇంతకూ మాయ అడ్రసు దొరకనేలేదే! ఈనత్తివాడు ఆ విషయంలో చోటే పెట్టకపోయెనే!- ఆపిల్ల జాడ దొరికినట్లయితే—

(గోవిందు వస్తాడు)

గోవిందు:- చిత్తం, వారువొచ్చారు.

అనంతం:- మళ్ళీనా !

గోవిందు:-చిత్తం. ఆయనకాదు. ఆయనవెంట లేహూ ఇద్దరు పిల్లలూ. అందులో ఒకామె.

అనంతం:- ఏ ఆమే.

గోవిందు:- ముసిముసినవ్వులు నవ్వలా, ఆమే ఉద్యోగంకోసం వచ్చిందట.

అనంతం:- ఆఁ. అట్లానా!—పోయి త్వరగా తీసుకురా.

(గోవిందు వెళ్లితాడు)

ఎంత చిత్రం! ఆపిల్లే వచ్చింది నౌకరికోసం! కాని.........దీన్లో ఏమీ తిరుగుడు లేదుకదా? ఏమైనా కానీ, కొంచెం జాగర్తగా వుండటం మంచిది.

(గంభీరంగా కూచుని కౌగితాలు తిరగవేస్తూ వుంటాడు. మీరా వొస్తుంది)

మీరా:- నమస్కారం—ఇదేమిటి!

(అనంతాన్ని చూసి ఆశ్చర్యపోతుంది)

అనంతం:- నమస్కారం! కూచోండి—

(కాయితాలు చూడటంలో మగ్నుడౌతాడు)

మీరా:- తమరేనా డిటెక్టివ్ అనంతంగారు?

అనంతం:- ఆఁ. (కాయితాలు సంగతి మరిచిపోయి) మీపేరేమిటి?

మీరా:- మీరా. క్షమించండి—మీరేకాదూ నిన్న—

అనంతం:- బీచిదగ్గర. ఆఁ. నేనే! సరిగ్గా గుర్తించారు. నిన్న మీతో మాట్లాడుదా మనుకున్నాను గాని మీరే త్వరగా వెళ్ళిపోయారు. (సద్దుకు కూచుని) చూడండి, నేను చాలా బిజీగావున్నాను. మీ కేమికావాలో సెలవిస్తే—

మీరా:- ఏమీలేదు. మీరు ఒక సెక్రటరీ కావాలని ప్రకటనచేశారు కదూ, అందుకోసం—

అనంతం:- ఓ, అదా! నాకు జ్ఞాపకమేలేదు. అయితే—మీరు సెక్రటరీపని చేయాలనా?

మీరా:-మీకు పనికివస్తానని తోస్తే.

అనంతం:- పనికిరావటమా? ఏమిటి మీరు చెప్పేది! మీలాంటి సెక్రటరీ దొరకటం—(సరుకుని) చూడండి. మీకు పనిచేయాలనివుంటే నాకే ఆక్షేపణాలేదు. ఉండిపోండి. పనికూడా అంత కష్టమైంది కాదు— పదిగంటలనుంచి—

మీరా:- అయితే నాకు ఉద్యోగం ఇచ్చినట్టేనా?

అనంతం:- ఆఁ. తప్పకుండా—మీకేమీ అయిష్టం లేకపోతే—

మీరా:- (నవ్వి) అయిష్టంవుంటే ఎందుకొస్తాను? కాని, నా క్వాలిఫికేషన్ మీరేమీ అడగలేదే!

అనంతం:- (గాభరాగా) అదే, ఇప్పుడు అడగబోతూవున్నాను. (గంభీరంగా) మీకు చదువనూ వ్రాయనూ తెలుసునా?

మీరా:- తెలుసు కొంచెం, ఇంటరు పాసయాను.

అనంతం:- ఏమిటీ? ఇంత చిన్నవయసులోనే? చూస్తే మీబుర్ర బ్రహ్మాండమైంది లాగా వుంది.

(ప్రశంసాదృష్టితో చూస్తాడు)

మీరా:- (తలవంచుకుని) నాబుర్ర అంత పెద్దదా!

అనంతం:- కాదూ! మీవయస్సులో నేను స్కూలుఫైనల్లో దేకుతున్నాను. (సర్దుకుని) ఏమిటి మనం మాట్లాడుకుంటున్నది?—ఆఁ. అయితే మీరు చదువుకున్నారన్నమాట. సరే—(బుర్ర గోక్కుని) కుట్టుపనీ, వంటా వగైరాలు తెలుసునా? సంగీతంకూడా—

మీరా:- (ఆశ్చర్యంతో) మీ ఆఫీసులో పనిచేయటానికి ఈ క్వాలిఫికేషన్లు కావాలా?

అనంతం:- అక్కర్లేదు! అంటే—నేను డిటెక్టివును కాదూ, అందుకని అన్ని సంగతులూ తెలుసుకోవాలి. అయితే మీకు—

మీరా:- షార్టుహాండ్ టైప్‌రైటింగ్ కూడా తెలుసు.

అనంతం:- (కాసేపు స్తంభించిపోయి) మీరు—మీరుచూస్తే చాలా అద్భుతమైనవారులాగా ఉన్నారు. మిమ్మల్ని చూసినకుందికీ నాబుర్ర పనిచేయకుండా పోతోంది. మీరేదో తప్పిపుట్టారు ఆడవారిగా!

గోవిందు:- (వాకిట్లోనించి తొంగిచూసి) ఒకగుంపు వచ్చారు బాబూ. ఆంగ్లో ఇండియను అమ్మాయిలూ, ఇండియన్ అమ్మాయిలూ.

అనంతం:- వాళ్ళందర్నీ పంపించివెయ్యి, సెక్రటరీ కుదిరిందని చెప్పి.

గోవిందు:- చిత్తం.

(తలలాక్కుని వెళ్ళిపోతాడు.)

అనంతం:- ఆఁ. ఏమిటి మాట్లాడుకొంటున్నదీ?....ఐతే మీరు ఇవ్వాళ నించీ సెక్రటరీగా నిర్ణయింపబడ్డారు. మీజీతం—నేను బాగా యోచించి తర్వాత చెప్తాను.

మీరా:- నెలకు అరవై రూపాయలు—ప్రకటనలో వేస్తిరిగా.

అనంతం:- అరవై రూపాయలా! అసంభవం! సరే, అవ్యవహారముగా ఉంచండి. మీరు రోజూ బీచికి షికారుపోతారా?

మీరా:- ఉహుఁ. నిన్న భీమసేనరావుగారు నా స్నేహితురాలిని పిలిస్తేనూ, నేనుకూడా వెళ్ళాను.

అనంతం:- అయితే, భీమసేనరావుగారు మీకేమవుతాడు?

మీరా:- ఏమీ కాడు! స్నేహితుడు....నే నేమే పనిచేయాలో తెలియ జెప్పితే బాగుండదూ?

అనంతం:- పనా? పని ఏమంత ఎక్కువలేదు. ఒకటి రెండు ఉత్తరాలు టైపుచేయాలి—అంతే....సరే, మీరు హిందువులేనా—వేరేగా భావించకండి.

మీరా:- మేము బ్రాహ్మలం.

అనంతం:- (కొంచెంసేపు మౌనంగా ఉండి) నేను హిందువును. కాని, హిందువుకూ, బ్రాహ్మలకూ ఉన్నతేడా ఏమిటో నాకర్థం కాకుండా ఉంది.

మీరా:- నాకుకూడా.

(ఇద్దరూ నవ్వుతారు.)

గోవిందు:- (తలుపులోనించి తలపెట్టి) బాబూ! అందర్నీ చిటికెల మీద వెళ్ళగొట్టాను.

అనంతం:- భేష్! ఇక బయట పహరా ఉండు, ఎవ్వరూ రాకుండా.

(గోవిందుమాయమౌతాడు.)

మీరా:- అయితే ఇకవెళ్తాను. రేపటినించి పనిలో ప్రవేశిస్తాను.

అనంతం:- వెళ్తారా ? అయితే—సరే, రేపు తప్పకుండా వస్తారు కదూ ?

మీరా:- ఎందుకురానూ ? సరిగ్గా పదింటికి వస్తాను.

అనంతం:- అక్కర్లేదు. మీకు ఇబ్బందిగా ఉంటే అంతతొందరగా రానక్కర్లేదు. పదకొండుకుగాని పన్నెండుకుగానీ వచ్చినా సరిపోతుంది.

మీరా:- అదేంమాట ! సరిగ్గా వేళకు వస్తాను. పనిదగ్గర పాలుమాలికా! (లేచి) అయితే సెలవు, నమస్కారం !

అనంతం:- నమస్కారం ! అయితే నిజంగానే పోతున్నారన్నమాట!

మీరా:- ఆఁ, రేపు వస్తాను.

(వెళ్ళుతుంది.)

అనంతం:- ఎంతచక్కటి పిల్ల ! ఎంత చమత్కారంగా మాట్లాడుతుంది ? మనదేశంలో ఇలాంటిపిల్లలు పుడతారని నాకు తెలియదు—కాని ఆనత్తివాడితో తిరుగుతుం దెందుకూ ? బ్రాహ్మలలో ఉన్నలోపమే అది! అడ్డమైనవాళ్ళతో ఆడిపిల్లల్ని—స్నేహితుడట ! మగవాళ్ళతో ఇంత స్నేహమెందుకూ ?—గోవింద్—గోవింద్ !

గోవిందు:- (వచ్చి) చిత్తం. అమ్మాయిగారిజాడా చిక్కిందా ?

అనంతం:- మాయజాడా ! భలే, ఆ సంగతే నాకు జ్ఞాపకం రాలేదు, సరే. ఆ సంగతి తర్వాత చూసుకుందాము. గోవింద్ ! ఈ గది ఎంత ఖరాబుగా ఉందో చూడూ ? వీటన్నిటినీ చక్కగా అమర్చు. బజారికి పోయి పూలు కొన్ని కొనుక్కురా. అంతే, మనకొత్త సెక్రిటరీకి ఏవేవి యిష్టమో అవన్నీ చేయాలి. (టైపిస్టుకుర్చీ వత్తిచూసి) కుర్చీ గట్టిగాఉంది. కుషన్ ఉన్నచైర్ తీసుకురా. ఇంకా రెండుమూడు మొహమల్ దిళ్ళు—తెలిసిందా ?

గోవిందు:- ఓ, చిటికెలమీద తెస్తాను—

# రెండో దృశ్యం

(నళిని గది. తొమ్మిదిన్నరఘంటలవుతుంది. నళిని, మీరా ఉన్నారు.)

నళిని:- ఇన్నాళ్ళు నౌకరీచేశావ్. ఒక్కనాడన్నా మీ డిటెక్టివ్ సంగతి చెప్పవేమే ?

మీరా:- ఏమి చెప్పేదీ ? చెప్పటాని కేమీలేదు.

నళిని:- అలాగా ! అతనికెన్నేళ్ళూ ?

మీరా:- యాభై, అరవై ఉంటై.

నళిని:- నిజమా ? చూపుల కెలాఉంటాడూ ?

మీరా:- భూతంలాగా.

నళిని:- ఎద్దేవ చేస్తున్నావా, నన్ను !

మీరా:- నమ్మకపోతే ఒకరోజుపోయి చూసి రాకూడదూ ?

నళిని:- నాకేమీ అవసరంలేదు. నీ కంత చెప్పటానికిష్టం లేకపోతే, నాకు అంతకంటే వినటాని కిష్టంలేదు.

(ముఖం తిప్పుకు కూచుంటుంది)

మీరా:- మళ్ళీకోపం వచ్చిందీ ? కాస్తైనా సరసంకూడా ఆడకూడదు ! సరే, నిజం చెప్పుతున్నాను విను. వయస్సు పాతికేళ్ళు. చూట్టానికి ఫర్వా లేదు——పెద్దమనిషిలాగానే ఉంటాడు. ముక్కుమాత్రం కొంచెంఎత్తు——

నళిని:- (మీరావైపు ఫ్రసన్నతిరిగి) నీతో ఏవిషయాలు మాట్లాడుతాడూ ?

మీరా:-ఏవిషయాలూ మాట్లాడడు. నాపని నేనుచేసుకుంటాను; ఆయన పని ఆయన చేసుకుకటాడు.

నళిని:- అసలే మాట్లాడుకోరా ?

మీరా:- బొత్తిగా మాట్లాడుకోము.

నళిని:- అయితే అతను చుంచులాంటి వాడన్నమాట !

మీరా:- కాదు, గుడ్లగూబ రకం.

నళిని:- నువ్వు మాట్లాడకుండా ఉండగలవూ ?

మీరా:- ఏం, ఎందుకుండలేనూ? నేనీమధ్య గాంభీర్యం నేర్చుకున్నాను.

నళిని:- (కాసేపు అలాగే చూసి) నిజం చెప్పుతున్నాను మీరా! నువ్వీ మధ్య చాలా మారిపోయావు.

మీరా:- ఎందుకు మారనూ? ఇంకా నేను చిన్నపిల్లనే అనుకున్నావేమిటీ? ఇప్పుడు ఉద్యోగం చేస్తున్నాను, ఇంటిపనులు చూస్తున్నాను. ఎన్ని బాధ్యతలు నానెత్తిమీద! (లోలోన నవ్వుకుని) సరే, ఇక నీ సంగతేమిటి? భీమసేనరావుతో నీ ప్రేమ ఎంతదూరం సాగింది?

నళిని:- ప్రేమ సాగటమేంటీ, నా మొహం?

మీరా:, అయితే వివరంగా చెప్తాను విను. నేనీమధ్య ఆఫీసులో వుంటున్నాను. భీమసేనరావూ నువ్వూ ప్రేమించుకోటంలో ఎంత దగ్గిరికి వచ్చారో నాకు తెలియలేదు. చెప్తావా?

నళిని:- చెప్పటానికేమీ లేదు. ప్రేమ ఒక ఎండమావి—దప్పికగొన్న స్త్రీ పురుషులు దానిదగ్గరకు పరుగెత్తుకుపోతారు. అక్కడ ఏముంటుందీ, కాలేకాలే ఇసికా—

మీరా:- నువ్వు గనక వేదాంతం మొదలుపెడితే నేను వెళ్ళిపోతాను—

నళిని:- పోతావా?—సరేగాని మీరా! నువ్వెప్పుడన్నా ప్రేమలో పడ్డావా? ప్రేమ అంటే ఏమిటో చెప్పగలవా?

మీరా:- ఉహుం. నాకు ఆఫీసు టైమైంది, వెళ్ళుతున్నాను.

(వెళ్లుతుంది)

నళిని:- మీరా అలా హఠాత్తుగా వెళ్ళిపోయిం దెందుకూ? దానిలో ఏమన్నా మార్పువచ్చిందా? నిజంగానే ప్రేమలో పడలేదుకదా? మనిషిని మనిషి ఎందుకు ప్రేమిస్తారో అర్థం కావటంలేదు! మొహంచూసి ప్రేమించటానికి వీలుందా? మాటలువిని ప్రేమించవచ్చా? నేను భీమసేనరావుని ప్రేమించలేదు; అయినా మీరా నన్ను మాటిమాటికీ ప్రేమించావంటుంది!

కాని, భీమసేనరావు నన్ను ప్రేమించాడా ? బహుశా ప్రేమించినట్టుగానే వుంది. ఆ రోజున బీచివొడ్డున—ఆయన మొహంచూస్తే నాకే భయం వేసింది ! చాలా. కోపిష్టి అనుకుంటాను—

(ఆలోచనలో సవ్వుకుంటుంది. భీమసేనరావు వస్తాడు)

భీమ:- నమస్కారం ఇటుపోతూ, పోతూ ఒకమాటు చూసిపోదా మనుకుని వచ్చాను.

నళిని:- కూచోండి.

భీమ:- కూచోను. నా కింకోచోటికి పోవలసిన పనివుంది. ఆ మనిషి జాడా దొరికేటట్టుంది.

నళిని:- ఏ మనిషి ?

భీమ:- వాడే—మీ బూటు విప్పదియ్యమన్నవాడు. వాడినే వెతుకు తున్నాను. వాడి ముముక్కు బద్దలుచెయ్యంది నాకు శాంతిలేదు. వస్తాను, న న నమస్కారం ! మీ మీరుమాత్రం జాగర్తగా వుండండి.

(వెళ్లుతాడు)

నళిని:- చిత్రమైన వ్యక్తి ! ప్రేమించటమంటే ఇదేనా ?— కాని నత్తివాడే—

## మూడో దృశ్యం

(అనంతం ఆఫీసు. ఒక ఉత్తరం చేతపట్టుకుని వుంటాడు. వేళ 10 గంటలు)

అనంతం:- ఉహుఁ. నాలో బొత్తిగా పాలుమాలిక వచ్చేసింది. ఈ మధ్య మాయసంగతి మరిచేపోయాను. గోపాలయ్యగారు ఉత్తరంరాశారు.- ఏంచేయాలి! తప్పకుండా ఆపిల్లే మాయ; ఇందులో సందేహమేమీలేదు; కాని ఋజువు ఎలాచేయటం? ఆ పిల్ల మీరా స్నేహితురాలేగా. ఆమెని అడిగితే ఆపిల్ల కాలిని పుట్టుమచ్చవున్నదా అని? ఉహుఁ....అలా అడిగితే ఒక చిక్కువుంది. మీరా సందేహించవచ్చు, నాకా పిల్లమీద........ మరి ఎట్లా? ఏదోవిధంగా ఆ పిల్లజాడా తీయాలి. (తలకు వేళ్ళుపోనిచ్చి) ఏంచేయాలి? ఏదోవిధంగా మిస్ మీరానించే కొంత భోగట్టా రాబట్టాలి. కాని ఆమె ఇంకా రాలేదే! (గడియారం చూసి) పదిదాటి అయిదు నిమిషాలయింది. నిన్నకూడా రెండు నిమిషాలు లేటు! ఇది చాలా ఘోరం—లేటు ఎందుకుకావాలి నిజానికి? ఏమాత్రం డిసిప్లిను....

(మీరా వస్తుంది)

మీరా:- (నవ్వుతూ) నమస్కారం.

అనంతం:- (గంభీరంగా) నమస్కారం. ఐదునిమిషాలు లేటు.

మీరా:- (తన గడియారం చూసుకుని) ఉహుఁ. ఇంకా మూడునిమిషాలు వుండుగానే వచ్చాను. మీ గడియారం ఫాస్టు.

అనంతం:- అసంభవం! ఏదీ మీ గడియారం?

మీరా:- (దగ్గిరికిపోయి) చూడండి.

(చాపిన చెయ్యిపట్టుకుని అనంతం కాసేపు అలాగే వదలకుండా చూస్తాడు. ఆ తర్వాత చెయ్యిఎత్తి చెవిదగ్గర పెట్టుకుంటాడు)

అనంతం:- అరే! మీ గడియారం నడుస్తున్నదే!

మీరా:- చెయ్యి వదలండి.

అనంతం:- (చెయ్యివదిలి) ఓ....మీచెయ్యి పట్టుకున్నసంగతే నాకు జ్ఞాపకంలేదు. నేను ఏదో ఆలోచిస్తున్నాను.

మీరా:- (తనచోటికి పోయి టైపురైటరు తీస్తూ) మీరెప్పుడూ ఆలోచిస్తూ వుంటారు. అంత ఆలోచన మంచిదికాదు.

అనంతం:- ఆలోచించక మార్గంలేదు! డిటెక్టివ్‌లు ఎల్లప్పుడూ ఆలోచించవలసిందే.

(మీరా పని ప్రారంభిస్తుంది. అనంతం ముగ్ధుడై అటే చూస్తూ వుండిపోతాడు. రెండునిమిషాలు గడిచింది.)

అనంతం:- మిస్ మీరా!

మీరా:- (తలఎత్తి) ఏమండీ?

అనంతం:- ఏమిటి నువ్వు టైపుచేసేది?

మీరా:- 'సినిమా చోరీ' కేసు తయారుచేస్తున్నాను.

అనంతం:- ఏ సినిమా చోరీ?

మీరా:-అదేనండీ! రామశాస్త్రి అనేఆయన సినిమా టిక్కెట్టు కొంటుంటే ఆయన జేబులో పర్సు పోలా! తొమ్మిదణాల ముక్కాసీ—ఆ కేసే.

అనంతం:- ఓ, జ్ఞాపకంవచ్చింది.

(మీరా మళ్ళీ టైపు మొదలు పెడుతుంది.)

అనంతం:- మిస్ మీరా!

మీరా:- ఏమండీ!

అనంతం:- నా బ్లూ పెన్సిలు ఎక్కడ పోయిందీ!....చూస్తే ఇక్కడ ఆఫీసు సంగతి ఎవ్వరూ పట్టించుకునేటట్టు లేదు.

మీరా:- (లేచిపోయి) అదుగో మీ ఎదురుగానే ఉంది!

అనంతం:- ఓ—(పెన్సిలు తీసుకుని) అరే ఇదేనే బ్లూపెన్సిల్! ఎంత పొరపాటో చూడండి! చూపు వేరేవేపు ఉంటంమూలాన కనపడనే లేదు.

మీరా:- పెన్సిలు కావలసినప్పుడు టేబిలుమీద చూస్తే కనపడుతుంది! సరే, మీరెక్కడ చూస్తున్నారు, మిద్దెపైనా?

అనంతం:- ఉహుఁ. పరధ్యానంగా మీ టైపురైటరువంక చూస్తున్నాను.

(మీరా గంభీరముఖం పెట్టుకుని వెళ్ళి టైపురైటరుముందు కూచుంటుంది. కొన్ని క్షణాలు గడుస్తై.)

అనంతం:-మిస్ మీరా!

మీరా:- మళ్ళీ ఏమొచ్చిందండీ? నన్నేం పనిచేసుకోనివ్వరా?

అనంతం:-ఎంత చిత్రం!..మీపని మీరు చేసుకోండి..నాకొక సందేహం కలిగింది. అందుకని....

మీరా:- ఏమిటా సందేహం?

అనంతం:- సరేగాని, ఆవేళ బీచీలో మీవెంట ఒక అమ్మాయి ఉండెనే ఆమె పేరేమిటి?

మీరా:- నళిని.

అనంతం:- నళినా? మాయకాదూ?

మీరా:- (ఆశ్చర్యంతో)మాయ ఎందు కవుతుందీ?

అనంతం:- అదికాదు—ఆమె సరిగ్గా లక్ష్మీవిగ్రహంలా ఉంటేనూ, మాయ అయి ఉంటుందేమోనని అనుకున్నాను:—ఆమె మీకు చాలాదగ్గరి స్నేహితురాలు కాదూ?

మీరా:- (పొడి గొంతుతో) ఎందుకో చెప్పండి ముందూ?

అనంతం:- ఊరకనే, తెలుసుకుందామని అడిగాను.

మీరా:-ఓ, నేనింకా లక్ష్మీ విగ్రహంలాంటి ఆమెఆకారం చూసి మీరు మరచిపోలేకుండా ఉన్నారేమోననుకున్నాను.

అనంతం:-ఎట్లా నేను చెప్పేదీ! నేనందుకోసం అడగలేదు మిస్ మీరా!

(మీరా వడిగా టైపు చేస్తుంటుంది.)

అనంతం:- (కొంచెం ఉండి) మిస్ మీరా!

(మీరా లేచివచ్చి అనంతం ఎదురుగా కూచుంటుంది.)

మీరా:- ఇక చెప్పండి. మీరు వేయదలుచుకున్న ప్రశ్నలన్నీ ఒక్కమాటే కానివ్వండి.

అనంతం:- మీతో పరిచయమై ఎన్నాళ్ళయి ఉంటుందా అని నేను ఆలోచిస్తున్నాను.

మీరా:- (వేళ్ళు లెఖ్ఖపెట్టి) సరిగ్గా నెలా మూడు రోజులు.

అనంతం:- ఓ, అలాగా! సరిగ్గా జ్ఞాపకంచేశారు. నేను జీతంసంగతే మరిచిపోయాను. (డ్రాయరులోంచి నోట్లుతీసి) తీసుకోండి.

మీరా:- ఇప్పుడు ఉంచండి. వెళ్ళేప్పుడు తీసుకుపోతాను.

అనంతం:- ఉహుఁ.. ఇప్పుడే తీసుకు ఉంచుకోండి. నాకు చాలా మతి మరుపు. బహుశా వెళ్ళేప్పుడు జ్ఞాపకం ఉండకపోవచ్చు.

మీరా:- ఐతే ఇవ్వండి. (నోట్లుతీసుకుని) ఇదేమిటి? ఎంత ఇచ్చారు?

అనంతం:- మూడొందలు.

మీరా:- మూడువందలా! ఎందుకూ? నాజీతం అరవైయేగా?

అనంతం:- ఎవరు చెప్పిందీ, అరవై అనీ? అసంభవం!

మీరా:- మీరు ప్రకటనలో అరవై అనే వేస్తిరిగా!

అనంతం:- అది అచ్చుపొరపాటు. పేపర్లు ఎలాంటి తప్పులు వేస్తయ్యో మీకుతెలుసా?

మీరా:- నో, మిస్టర్ రావ్! నేను అరవైకంటే ఎక్కువ తీసుకోలేను.

అనంతం:- ఏమిటీ ఉపద్రవం! నేను అచ్చుతప్పని చెప్తుతుంటినిగా.

మీరా:-ఎందుకు చెప్తుతారు అబద్ధాలూ? అచ్చుతప్పుకాదు. అరవై రూపాయలకంటే ఒక్కదమ్మిడీ ఎక్కువ తీసుకుంటే నాకు మనశ్శాంతి ఉండదు. ఇదుగో మీడబ్బు మీరు తీసుకోండి.

(కొన్నినోట్లు తిరిగి ఇస్తుంది.)

అనంతం:- అయితే తీసుకోరన్నమాట?

మీరా:- ఉహుఁ.

అనంతం:- తీసుకోరూ?

మీరా:- ఉహుఁ.

అనంతం:- సరే, మీ ఇష్టమొచ్చినట్టు చెయ్యండి. నా ఆఫీసులో నామాట వినరన్నమాట. సరే, అదే మీకు ధర్మమైతే అట్లాగే కానివ్వండి.

(ఉదాసీనంగా కాళ్లుఎత్తి టేబిలుమీద పెడతాడు. మీరా తనచోటికి పోయి పని చేసుకోటం మొదలుపెడుతుంది)

అనంతం:- (పైవంక చూస్తూ) మగవాడిచేతిలో డబ్బువుంటే నానా దుర్బుద్ధులూ పుడతై. బహుశా ఒకనాడు తాగాలనికూడా కలగవచ్చు! గుర్రపు పందేలకుకూడా పోవచ్చు. ఇలాంటివి చేయకుండా చూడటానికి నాకు ఒక్క స్నేహితుడుకూడా లేడు.

మీరా:- (నీరుతిరిగిన కళ్ళతో) మిస్టర్ రావ్! నన్ను క్షమించండి. మీరు అలా మాట్లాడటం బాగాలేదు. మీ దగ్గర అరవై రూపాయలకు ఎక్కువ తీసుకోవటం, నా ఆత్మగౌరవానికి భంగం.

అనంతం:- అయితే అలాచేయమని ఎవరన్నారు? మీ ఆత్మగౌరవానికి భంగమొచ్చే పని నేనుమాత్రం ఎందుకు చేయమంటాను?

(గంభీరముఖంతో ఉదాసీనంగా లోపలికిపోతాడు)

మీరా:- ఆయన మనసులో ఉద్దేశమేమిటో నాకేమీ అర్థంకాలేదు. కాసేపు నవ్వుతూమాట్లాడతాడు. మళ్ళీ అంతలోనే కోపం తెచ్చుకుంటాడు! మగవాళ్ళమనసు తెలుసుకోటం చాలా కష్టం!....కాని నళినిని గురించి ఆయన కంత కుతూహలమెందుకూ? సరిగ్గా అరనిమిషంకూడా చూడలేదే ఆవాళ. ఇంకా మరిచిపోలేకుండా వున్నాడు? మరిచిపోలేకపోతేమాత్రం మనకొచ్చే దండగ ఏమున్నదీ? అయినా, ఈయన హిందువు, నళిని బ్రహ్మసమాజం—వీళ్ళిద్దరికీ ఎలా కుదురుతుందీ? పోనీ మనకెందుకొచ్చిన గొడవ ఇది, నాపని నేను చేసుకుపోతాను. నాకు రావలసిన దానికంటే దమ్మిడీకూడా ఎక్కువ తీసుకోను. ఆయన భాగ్యవంతుడైతే కావచ్చు. సర్దాకు డిటెక్టివు గిరీ తీసుకుంటే తీసుకోవచ్చు—అంత డబ్బు ఎక్కువవుంటే ఇతర్లకు పంచిపెట్టుకోనీ; నేనుమాత్రం తీసుకోను.

(మీరా పని మొదలుపెడుతుంది. అనంతం మెల్లగావచ్చి వెనక నుంచుంటాడు)

అనంతం:- మిస్ మీరా!

మీరా:- ఏమండీ?

అనంతం:- నన్ను క్షమించు. నీకు డబ్బు ఎక్కువ ఇవ్వబోవటం నాదే తప్పు.

మీరా:- ఉహుం. ఇందులో తప్పేముందీ? మీరు సదుద్దేశంతోనే ఇవ్వబోయారు.

అనంతం:- (మీరా భుజంమీద చెయ్యివేసి) చెప్పండి. నన్ను క్షమించారా?

మీరా:- (లేచి ఎండగా నుంచుని, వణుకుతున్న గొంతుతో) ఆఁ. క్షమించాను.

అనంతం:- మీకింకా కోపం తగ్గలేదు.

మీరా:- నాకేమీ కోపంలేదు మిస్టర్ రావ్!

అనంతం:- ఐతే మరెందుకు నవ్వటంలేదు?

మీరా:- (మందహాసంచేసి) ఇదిగో నవ్వితినిగా.

అనంతం:- (ఆప్యాయంగా చేతులుచాపి) రండి, స్నేహం చేసుకొందాము—కోపంకాదు.

(ఇష్టం లేకపోయినా మీరా నవ్వుతుంది. ఆ తర్వాత చేతులుచాపి, అనంతం చేతులు పట్టుకుంటుంది)

అనంతం:- రండి—ఇవ్వాళ కొంచెం షికారుకుపోదాము. ఆఫీసులో ఏమీ బాగోలేదు.

మీరా:- ఎక్కడికీ?

అనంతం:- పీపుల్సు పార్కుకు. అక్కడ బోటుఎక్కి షికారుచేద్దాం.

మీరా:- ఉహుఁ—నాకు చాలా ఆలస్యమవుతుంది.

అనంతం:- ఏమీ ఆలస్యంకాదు. సరిగ్గా నాలుగుగంటలకు మీ ఇంటి దగ్గర వదులుతాను. (మీరా ఇంకా సమ్మతించదు) మీరు రాకపోతే నామీద కోపంగా వున్నారనుకుంటాను.

మీరా:- అయితే పదండీ!

# తృతీయాంకము

## ఒకటో దృశ్యం

(మీరా పడకగది. బుగ్గనిచేయిపెట్టుకుని మంచంమీద కూచునివుంటుంది. వేళ ఉదయం పది)

మీరా:- ఏంచేసేది ఇప్పుడు? ఆయన మనసులో సంగతేమిటో నా కర్థంకావటంలేదు—పైగా ఆయన స్పష్టంగా చెప్పనూ చెప్పడు. ఈ స్థితిలో నేనెట్లా నడుచుకోవాలి?....అసలీ నౌకరీ ఎందుకు చేయబోయా నంట! మరి వదిలేదా?....ఉహుఁ. అది కుదరదు. అలాగైతే అమ్మకు విశ్రాంతి ఎట్లా చిక్కుతుంది? (నేపథ్యంలో పార్వతమ్మ:- 'మీరా, అన్నంతినవూ?' అని పిలుస్తుంది) వస్తున్నానమ్మా....ఆయనికి కావలసిం దేమిటి? నిజంగా నేనేనా? లేక నళినా? నళిని సంగతి మధ్యమధ్య హఠాత్తుగా అడుగుతూ ఉంటాడు. (పెదవి కొరుక్కుని) ఆయన మన సులో ఏముందో ఆయనకే తెలియాలి - ఇటు నా ప్రాణంమీదికి వచ్చింది! మరి మనిషికీ మనిషికీ తేడాలేదంటారు కదా, బ్రాహ్మమతస్థులకీ, హిందువులకీ-? ఉహుఁ. నేను మనసును గట్టిపరచుకోవాలి! ఎంత చపల చిత్తపుదీ నామనసు! ఆయనతో ఇక నవ్వుతూ మాట్లాడకూడదు- ఆఫీసుకు మామూలు గుమస్తాలాగా పోతాను. ఆయనకీ నాకూ ఉన్న సంబంధంకూడా యజమానికీ, గుమస్తాకీ ఉన్న సంబంధమే!

పార్వ:- (వచ్చి) ఏమే నువ్వు ఆఫీసుకు పోవా? పదిగంటలైంది.

మీరా:- (లేచి) ఇదుగో, పోతున్నానమ్మా.

పార్వ:- ఏమే. ఈమధ్యని నువ్వెందు కట్లా ఉంటున్నావు? ముఖం వాడిపోయింది. పనినచ్చలేదా? బాగుండకపోతే నౌకరి వదిలెయ్యరాదూ?

మీరా:- అదేమిటమ్మా, పనెందుకు బాగాలేదూ,

పార్వతి:- మరీ? ఈమధ్యని రోజూ ఆలస్యం చేస్తున్నావు. మీ యజ మాని ఊరుకుంటాడా?

మీరా:- ఊరుకోక !

పార్వతి:- అదేమిటే ! పనిచేస్తే సరిగ్గాచెయ్యి. లేకపోతే మానుకో! రా, రా. అన్నంకూడా ఆరిపోతోంది. పందొమ్మిదేళ్లు వచ్చినై, ఇంకా కుర్రచేష్టలు పోలేదు.

మీరా:- పద, (తల్లి వెళ్లుతుంది) పందొమ్మిదేళ్ళు వచ్చినై. ఉహుఁ. నాకిక కుర్రచేష్టలు పనికిరావు.

---

## రెండో దృశ్యం

(అనంతం ఆఫీసు)

అనంతం:- గోవింద్, మనం చెన్నపట్నంవచ్చి ఎన్నాళ్ళయింది ?

గోవిందు:- మూడు మాసాలు నిండటానికి ఇంకా రెండురోజులున్నై సా.

అనంతం: -ఆఁ. ఏమిటీ ? ఇంతవరకు మాయనుగురించిన బోగట్టా ఏమీతెలియలేదు. ఉహుఁ—ఇక ఊరుకుని లాభంలేదు. ఏదో ఒకటి చేసి తీరవలసిందే.... మరి కాలిమచ్చ సంగతి తేలేదెట్లా ? ఈరోజుల్లో ఆడపిల్లలు మేజోళ్లు అసలు విప్పదీయటమేలేదు - ఎంత విషమ సమస్య ! పదిన్నర అయింది, ఇంకా సెక్రటరీ రాలేదు....అంచేతనే ఏపనీ జరగటం లేదు. మాయజాడ, అంటే నళిని....

(మీరా వస్తుంది)

మీరా:- (పాడిగొంతులో) నమస్కారం. కొంచెం ఆలస్యమయింది, క్షమించండి, రేపటినించి వేళకువస్తాను.

(తనచోటికిపోయి కూచుంటుంది)

అనంతం:- మిస్ మీరా! ఇవ్వాళ మీ మొహం అలా వాడిపోయిఉన్న దెందుకనీ ?

మీరా:- ఏమీలేదు.

అనంతం:- తప్పకుండా ఏదో ఉండిఉంటుంది. సరే నేను కనిపెడ తానుచూడు.....మీ స్నేహితురాలు నళినితో తగువువచ్చిందికాదూ?

మీరా:- (తల వేగంగాతిప్పి) ఉహుఁ.

అనంతం:- మరి ఏంజరిగిందీ?

మీరా:- ఏమీజరగలేదు, మిస్టర్ రావ్, నాపని నన్నుచేసుకోనివ్వండి.

అనంతం:- ఓ, అలాగే. (కాసేపు గదిఅంతా పచారుచేసి) మిస్ మీరా, నేను డిటెక్టివుపని వదిలేస్తున్నాను - నా కిదేమీ బాగోలేదు.

మీరా:- (చకితురాలై, తర్వాత నిరుత్సాహంతో) మంచిది, ఎప్పటి నించీ?

అనంతం:- ఇంకా రెండు మూడు రోజులుంటుంది ఆఫీసు, ఆతర్వాత మూసివేస్తాను.

మీరా:- మరీసంగతి నాకు ముందెందుకు చెప్పలేదూ? నేనెక్కడైనా పనిచూసుకునేదాన్నిగా! న న్ననవసరంగా చిక్కుపెట్టారు.

(మీరా కళ్ళల్లో నీరు తిరుగుతుంది.)

అనంతం:- (మీరా వెనకకుపోయి) మీరా! నేను నిన్ను - నిన్ను వేరేచోట పనిచేయనివ్వను. నువ్వు నాదగ్గరే—

(వీపుమీద చెయ్యివేస్తాడు)

మీరా:- (మెరుపులాగా లేచి) నావొంటిమీద చెయ్యివెయ్యకండి.

అనంతం:- మీరా! నేను నిన్ను—

మీరా:- చాలించండి! నేను ఆడదాన్నని గుర్తుపెట్టుకోండి, మీకేం అధికారముందీ, నన్ను అవమానించటానికి?

అనంతం:- (ఆశ్చర్యంతో) అవమానమా?

మీరా:- అవమానంకాక మరేమిటి! మీరు లోలోపల ఇంకోమనిషిని- అబ్బ! ఎంతమోసముంది మీలో? నేను మీదగ్గర పనిచేస్తుంటేమాత్రం-

(ఏడుస్తుంది)

అనంతం:- మీరా! నేను ప్రమాణంచేసి చెప్పుతున్నాను. నాలో మోసమేమీలేదు.

మీరా:- (ఏడుస్తూనే) నాదగ్గర అబద్ధాలు చెప్పమాకండి, మిమ్మల్ని నేను బాగా కనుక్కున్నాను. దిక్కులేని ఆడవాళ్ళని అవమానించటమే మీ స్వభావం. కాని నేను దిక్కులేనిదాన్ని కాను—

అనంతం:- నేనలాంటి వాడినని నీకెవరు చెప్పారు?

మీరా:- ఒకరు చెప్పాలా! మీరు నాకుచేసిన అవమానం చాలదూ? (కళ్లు తుడుచుకుని వాకిటిదగ్గరకు పోతూ) నేను వెళ్లుతున్నాను.

అనంతం:- మీరా! ఒక్కమాట విను—

మీరా:- ఊహుఁ. నేను ఉండను, ఉండలేను. మీరు నాకోసం రాకండి.

(త్వరగా వెళ్ళిపోతుంది. అనంతం స్తంభించిపోతాడు.)

అనంతం:- ఏమి టీ గొడవ! నేనెప్పు డవమానించానూ! (కొంచెం ఆలోచించి) ఓ, అర్థమయింది. ఆ ప్రస్తావన తేవటమే అవమానం! ఆమె బ్రహ్మ సమాజం, నేను హిందువూ!—ఎంత దూరముందీ మా ఇద్దరి మధ్యా! లోలోపల నేనంటే అసహ్యమన్నమాట - మరి ఈ సంగతే నేను కనిపెట్టలేక పోయానే! కాని ఆవాళ అందరూ ఒకటేనని అన్నదిగా!- (దీర్ఘంగా నిట్టూర్చి) పోనీ, ఇంతటితో తేలిపోయింది! నేనింకా ఏదో గాలి మేడలు కట్టుతున్నాను. ఇక హాయిగా మనఊరు వెళ్ళిపోవచ్చు!- గోవింద్!

గోవిందు:- (వచ్చి) చిత్తం విరాజపురం జమీందారుగారు చిటికెల మీన వచ్చేశారు.

అనంతం:- గోపాలయ్యగారా? - ఆ, రానీ. ఇంకా మాయసంగతి తేలనేలేదు, సరే, ఇవ్వాళ ఏదో ఆఖరి ప్రయత్నంచేసి చెన్నపురి కోచిన్న సలాం పెట్టేస్తాను.

(గోపాలయ్య వస్తాడు.)

అనంతం:- రండి మామయ్యగారూ। (నమస్కరిస్తాడు.)

గోపా:- బాగా ఉన్నావా, నాయనా।

అనంతం:- మీదయవల్ల బాగానే ఉన్నాను, కూచోండి.

గోపా:- (కూచుని) నీ దగ్గరినించి ఏమీ జవాబు లేకపోయేవరకు, మనసాగక వచ్చేశాను.

అనంతం:- మంచిపని చేశారు. ఎక్కడ దిగారూ?

గోపాల:- ఉడ్‌లాండ్సులో. ఎప్పుడూ అక్కడే దిగుతాను - ఏమి నాయనా! ఏమన్నా జాడా తెలిసిందా?

అనంతం:- తెలిసింది. కాని, ఇప్పుడు ఋజువుపరచుకోవాలి. ఇవ్వాళ రాత్రే ఆ పనిచేద్దామని నిశ్చయించుకున్నాను.

గోపా:-తెలిసిందా। నిజంగానేనా అనంతం! ఎక్కడఉందీ, ఎలాఉందీ?

అనంతం:- బాగానేఉంది. మీరేమీ ఆదుర్దాపడకండి, (గోపాలయ్య ముక్కు చీదుకుంటాడు.) మామయ్యగారూ, ఇవ్వాళరాత్రి పదిన్నరకు మీరు రండి - మీకు మాయను గురించిన భోగట్టాఅంతా చెప్పుతాను.' ఇప్పుడు మాత్రం మీరుకాస్త దయదలిచి నన్ను ఆలోచించుకోనివ్వండి.

గోపా:- అలాగేనాయనా! నేను పదిన్నరకేవస్తాను.

(గోపాలయ్య లేచి వణుకుతూ ఉంటాడు. అనంతం ఆయన్ని పట్టుకుని వాకిలిబయటకు పంపుతాడు.)

అనంతం:- ముసలాయన చాలా దిగులుపడిపోయాడు. (జుట్టులోకి వేళ్ళుపోనిచ్చి) ఏమిచేసేది, నాతలకాయ। ఆలోచనకూడా పోవటంలేదు. ఇదే డిటెక్టివ్ అనంతం కడసారి Exploit! ఇవ్వాళరాత్రి నళిని నిద్ర పోయేటప్పుడు, కాలుచూడాలి. మచ్చఉన్నదా, సరే। లేకపోతే గోపాలయ్యకు నావల్ల కాలేదని చెప్పేస్తాను. అంతే - ఆతర్వాత ఎటోజండా ఎత్తేస్తాను - ఈ ప్రపంచమంటే నాకు బొత్తిగాఇష్టంకూడా పోతోంది....

## మూడో దృశ్యం

(మీరా ఇంటిపక్కన గల్లీ. జనం ఎవరూలేరు. రాత్రి తొమ్మిది అయిఉంటుంది. ఇంటోనించి పాట వినపడతూ ఉంటుంది. భీమసేనరావు గల్లీకీనీడను నుంచునిఉంటాడు. పాట ఆగిపోతుంది - అనంతం జేబుల్లో చేతులుపెట్టుకుని నిర్భయంగా ప్రవేశిస్తాడు. వాకిట్లోంచి వచ్చే వెలుతురు పోతుంది.)

అనంతం:- బహుశా వాకిలి తెరిచేఉంటుంది. (నాలుగుదిక్కులా చూచి) రోడ్డుమీదకూడా ఎవరూలేరు - ఇదేమిటి?

(భీమసేనరావు నీడనించి బయటికివస్తాడు.)

భీమ:- నువ్వా డి డి డి డిటెక్టివ్వేకదూ! (దగ్గరికివచ్చి) ఏమోయ్ డి డి డిటెక్టివ్! ఏం పనిమీదవచ్చావు ఇంతరాత్రిపూట?

అనంతం:- ఎందుకొస్తే నీకెందుకూ?

(మెల్లగా వెళ్ళిపోతాడు.)

భీమ:- (సందేహిస్తూ చూసి) అ అ అనుమానంగా ఉంది - పె పె పెద్ద అనుమానంగాఉంది! సరే చూస్తాను - ఈ సందట్లో నౌకర్ని ఒక పట్టు పట్టిచూస్తే?

(త్వరగా వెళ్ళిపోతాడు.)

## నాలుగో దృశ్యం

(రాత్రి. మీరా పడకగది. మీరా పిచ్చిదానిలాగా పడకమీద కూచుని ఉంటుంది. ఆమె చేతిలో పెళ్ళిసర్టిఫికెట్టు.)

మీరా:- ఏమిటి ఈ రహస్యం? దీనిప్రకారం చూస్తే అమ్మా, నాయనా పెళ్ళిఅయింది 17 జనవరి 1929. అంటే పనిహేడేళ్ళ క్రిందట. మరి నా వయసు 19. 'ఇదెలా సంభవం? సర్టిఫికెట్టు అబద్ధంకాదు - చాలా జాగర్తగాకూడా దాచారు. అబ్బ - నాకు ఆలోచనకూడా పోకుండాఉంది. అయితే నేను—ఓ, భగవాన్! నాకెంత తలవంపుతెచ్చావు! ఇక నేను భరించలేను. ప్రపంచమంతా నన్ను హీనంగా చూస్తారు! నా తల్లీ తండ్రీ నా పుట్టుకతోటే నాకు కళంకం ఆపాదించారు! నేనిప్పు డేమిచేసేదీ? ఎక్కడకు పోయేదీ?

(నెత్తిమీద చేతులుపెట్టుకు అలానే కూచుంటుంది. తెరిచిన తలుపు నించి అనంతం చప్పుడు చేయకుండా ప్రవేశిస్తాడు.)

మీరా:- (తలయెత్తి భయంతో) ఇదేమిటి! ఎవరు మీరూ?

అనంతం:- ఆఁ! నువ్వా మీరా? నేనింకా....

మీరా:- మీరా! ఈవేళప్పుడు నాగది కెందుకు వచ్చారూ?

అనంతం:- పొరపాటుపడి....నేను నళినిగది అనుకున్నాను.

మీరా: నళినిగది అనుకుని నాగదిలోకి వచ్చారా? (విస్తుపోయి చూస్తూ) దానిగదిలో మీ కేంపనీ?

(అనంతం మాట్లాడడు.)

మీరా:- ఊఁ, తెలిసింది. దాన్ని మీరు ప్రేమిస్తున్నారన్నమాట!

అనంతం:- (వ్యాకులపాటుతో) మీరా! నువ్వు తప్పర్థం చేసుకుంటున్నావు—నేను పనుండి—

మీరా:- నా దగ్గర అబద్ధాలు చెప్పకండి - మీరు నళినిని ప్రేమిస్తున్నారు.

(హఠాత్తుగా ముఖం దిండులోదోపి వెక్కుతుంది.)

అనంతం:- (మంచం దగ్గర మోకాళ్ళమీద కూచుని) మీరా! నామీద స్సాక్షిగా నేను నళినిని ప్రేమించటం లేదు.

మీరా:- తప్పకుండా ప్రేమిస్తున్నారు.

అనంతం:- లేదు, మీరా! నేను నిన్నే ప్రేమిస్తున్నాను.

మీరా:- మరి ఇంతరాత్రివేళ నళినికోసం వచ్చింది ఎందుకూ?

అనంతం:- అదా! చెప్పుతాను విను. మా ఊరిదగ్గర ఒక జమీందారున్నాడు. ఆయనకూతురు మాయ అనేపిల్లని చిన్నప్పుడు దొంగలు ఎత్తుకుపోయారు. ఆ పిల్లను వెతకటానికి నేనువచ్చాను. మీ స్నేహితురాలు నళినినిచూస్తే నాకు ఆపిల్లే మాయ అయిఉండాలని సందేహం కలిగింది.

మీరా:- ఎందుకు అనవసరంగా కథలల్లుతారూ?

అనంతం:- కథలల్లటంలేదు. నేనిది నిజమని ప్రమాణంచేసి చెప్పుతాను. మాయతండ్రి గోపాలయ్య వచ్చాడు——

మీరా:- (హఠాత్తుగా లేచి) ఊరుకోండి! ఎవరో ఇటువస్తున్నారు! బహుశా మా అమ్మో, నాయనో అనుకుంటాను. వారొచ్చి మిమ్మల్ని ఈ గదిలోచూస్తే ఏమనుకుంటారు?

అనంతం:- అయితే పోతున్నాను. కాని, మీరా! నేను నిన్నుతప్ప మరెవ్వరినీ ప్రేమించటంలేదని - (మీరానోటిమీద వేలుపెట్టుకుంటుంది) అయితే పోతున్నాను. రేపు నీకోసం కాచుకునిఉంటాను. తప్పకుండారా.

(కిటికీగుండా వెళ్ళిపోతాడు)

మీరా:- నిజమూ అబద్ధమూ రెండూ కలిసిపోయినై. ఏది నమ్మేదీ? (కిందపడిఉన్న సర్టిఫికేట్ తీసి) కాని ఇది నమ్మకపోవటానికి ఏమీ ఆక్షేపణ లేదుగా!

(తల్లి వస్తుంది)

పార్వ:- ఏమే నీగదిలోఎవరిగొంతో వినిపించినట్టుగాఉంది. ఎవరా మనిషి?....ఏమిటే నీ చేతులోదీ?

మీరా:- అమ్మా ! నాయన ఏడీ ?

(తండ్రి వస్తాడు)

అడుగో !....ఏమమ్మా ! నాకు పందొమ్మిదోయేడుకాదూ ?

పార్వ:- ఆఁ. ఎందుకలా అడుగుతావూ ?

మీరా:- (సర్టిఫికేట్ ఇచ్చి) మరి దీని అర్థమేమిటి ?

(తండ్రి అలానే కూలబడతాడు. తల్లి కొయ్యలాగా నిలబడిపోతుంది.)

మీరా:- నాన్నా ! దీని అర్థమేమిటీ ? అయితే నేను—?

తల్లి:- ఉహుఁ. అదేమీకాదు మీరా !

(భార్యా భర్తలు ఒకరి నొకరు చూసుకుంటారు)

మీరా:- మరేమిటీ నాన్నా ? అయితే నాకంతా వివరంగా చెప్పండి !

తండ్రి:- (భగ్నస్వరంతో) ఎప్పటికైనా సత్యమే జయించింది. మీరా, నువ్వు మా పిల్లవుకావు - దొరికావు.

మీరా:- దొరికానా ? నేను దిక్కులేనిదాన్నా ?

తండ్రి:- ఆఁ. మాకు పిల్లలులేరు. మాకుపెళ్లి అయిన రెండు సంవత్సరాలకు దొరికావు — పద్దానుగేళ్ళయింది. అప్పటికి నీకు నాలుగేళ్లు. నువ్వు దొరకగానే మేము విశాఖపట్నం వెళ్ళాము. ఆ తర్వాత—

మీరా:- అమ్మా ! అయితే నువ్వు నా అమ్మవుకావా ! నాన్నా ! నువ్వు కూడా నాకేమీకావా ?

పార్వ:- (ఏడుస్తూ మీరాను దగ్గరకు తీసుకుని) మీరా ! నువ్వే మా సర్వస్వం !

తండ్రి:- సొంతపిల్లలు ఇంకెట్లా ఉంటారో మాకు తెలియదు. ఈ పద్దానుగేళ్ళనించీ నువ్వే మా కన్నిటికీ.

మీరా:- అయినా నేను మీకేమీకాను—రక్తసంపర్కం ఏమీలేదు. నేను—ఏకాకిని— ఈ ప్రపంచంలో నాకెవ్వరూలేరు—ఏకాకిని ! దిక్కులేకుండా వదిలేసినదాన్ని ! (కాసేపు స్తబ్దుగా ఉండి) అమ్మా నేను వెళ్ళుతున్నాను.

పార్వ:- (వ్యాకులపాటుతో) ఎక్కడికి వెళ్లుతావే తల్లీ ?

మీరా:- ఒకవ్యక్తి నాకోసం ఎదురుచూస్తూ ఉంటాడు--అతని కన్ని సంగతులూ చెప్పాలి. అతనికి నేను కావాలో అక్కరలేదో తెలియదు-అయినా అతనికి చెప్పక గత్యంతరంలేదు.

(తొందరగా వెళ్లిపోతుంది.)

పార్వ:- మీరా! మీరా!! - ఏమండీ మీరింకా కూచునేఉన్నారేమిటి ?

తండ్రి:- ఏమిచేసేదీ ? నిజం మరుగుపరచి ఆపిల్లనింతవరకూ కట్టి ఉంచాము-ఆమరుగు తొలగగానే వెళ్ళిపోయింది. (లేచి) ఎవరిదగ్గరికి పోయి ఉంటుంది ?

పార్వ:- నాకేమీ తెలియదు.

(నళినివస్తుంది)

నళిని:- ఏమిటీ గంద్రగోళం! మీరా ఏదీ ?

పార్వ:- ఎక్కడికో వెళ్ళిపోయింది.

నళిని:- వెళ్ళిపోయిందా!

పార్వ:- ఆఁ. నీకు తెలుసునా నళినీ. ఎక్కడికి పోయిఉంటుందో? దాన్ని తిరిగి తీసుకురాగలవూ ?

నళిని:- (పెదాలు కొరుక్కుని ఆలోచించి) బహుశా తీసుకురాగలను. అది ఎక్కడికి పోయిఉంటుందో నేనూహించాను. నాదగ్గరకూడా దాచింది గాని, నేను గ్రహించేశాను! రండి నాతోపాటు.

---

## అయిదో దృశ్యం

(అనంతం ఆఫీసు. రాత్రి. అనంతం ఒంటరిగా ఉంటాడు.)

అనంతం:- పదింబావు అయింది; కాసేపట్లో గోపాలయ్యవస్తాడు. గోవింద్! గోవింద్!! (గోవిందురాడు.) మీరా రేపువస్తుందా? అనవసరంగా నామీద సందేహించింది. నళినిని ప్రేమిస్తున్నానని....లేకపోతే నిజంగా నామీద అసహ్యమేమీలేదని అనుకుంటాను. గోవింద్! గోవింద్!!....ఇంతరాత్రిపూట వీడు ఎక్కడికిపోయినట్టు!

(వాకిటిబయట ఆర్తధ్వని)

ఏమిటీశబ్దం! మీరాగొంతుకాదూ?

(పరుగెత్తుకుపోయి, మళ్ళీ మీరాను చేతులమీద తీసుకునివస్తాడు.)

అనంతం:- మీరా! ఎట్లాపడిపోయావు? ఏమి తగిలిందీ కాలికీ?

మీరా:- చీకట్లో మెట్లెక్కుతూఉంటే కాలు బెసికింది.

అనంతం:- (మీరాను సోఫాలోపండుకో బెట్టి) ఏ కాలూ?

మీరా:- ఎడమకాలు?....నేనీరాత్రి మీకోసం వచ్చాను.

అనంతం:- ఆసంగతి తర్వాతమాట్లాడుకోవచ్చు. ముందు కాలు చూడనివ్వు.

(బూటు విప్పదీయటం మొదలుపెడతాడు)

మీరా:- నా కెవ్వరూలేరు—ఏకాకిని—దిక్కులేనిదాన్ని.

అనంతం:- (బూటువిప్పి పుట్టుమచ్చ చూసి ఆశ్చర్యంతో) ఆఁ. మీరా! నువ్వు మాయవి!

మీరా:- మాయా?

అనంతం:- (ఉద్రేకంలో అన్నీ మరిచిపోయి) ఆఁ! ఇదుగో పుట్టుమచ్చ! నువ్వే మాయవి మీరా! అంటే మాయా, నువ్వే మీరావి!

మీరా:- మాయ ఎవరూ?

అనంతం:- నేను చెప్పలే, ఆపిల్లే....ఆపిల్లను వెతకటానికే నేను

వచ్చాను। అబ్బ! నే నెటువంటి డిటెక్టివుని? రెండు మాసాలనించి నిన్ను చూస్తున్నాను, ప్రేమించాను—నువ్వే మాయవైనసంగతి మాత్రం కనుక్కోలేక పోయాను?

మీరా:- అయితే మీరు నన్ను వెతకటానికే నన్నమాట రాత్రివచ్చింది?

అనంతం:- ఆఁ. కాలిని ఈపుట్టుమచ్చ చూడను.

మీరా:- (సిగ్గుతో) నేననుకున్నానూ, మీరు నళినికోసం—

అనంతం:- ఉహుఁ. కేవలం నే నీపిల్లకోసమే—

(అనంతం మోకాళ్ళమీద కూచుని మీరాని దగ్గరికి లాక్కుంటాడు.)

మీరా:- నేను సరిగ్గా అర్థంచేసుకోలేదు, పొరపడ్డాను క్షమించండి.

(తల అనంతం గొమ్మున ఆనిస్తుంది. గోపాలయ్య వస్తాడు.)

అనంతం:- (హుషారుగా పైకిలేచి) మామయ్యగారూ। ఇదుగో మీ కుమార్తె మాయ. ఇదుగో కాలిని పుట్టుమచ్చ।

గోపాల:- (కంపితస్వరంతో) మాయా!

అనంతం:- మీరా! ఈయనే నీ అసలు తండ్రి.

మీరా:- (కళ్లువిప్పారు చూసి) ఉహూఁ. మా అమ్మ ఏదీ? నాన్న ఏడీ? నేను వాళ్ళదగ్గరికి పోతాను.

గోపా:- మాయా! నిన్ను పెంచినవారు—

మీరా:- పెంచటమా! ఉహుఁ. వారే నాఅసలు తల్లి దండ్రులు. ఇవ్వాళ నాకు ఏదో పూనింది - అందుకనే వారిని నొప్పించి ఇక్కడికి వచ్చాను. (అనంతంతో) నన్ను వారి దగ్గరికి తీసుకుపోండి.

(నళిని, పార్వతమ్మ వస్తారు.)

అనంతం:- తీసుకుపోవలసిన అవుసరంలేదు. వారేవచ్చారు. నళిని కూడా వచ్చిందిలాగా ఉందే!

పార్వ:- మీరా!

(పార్వతమ్మ పరుగెత్తుకుపోయి మీరాని కౌగిలించుకుంటుంది. రామయ్య మీరాతల నిమురుతూఉంటాడు. నళిని చేతులుకట్టుకు

కూచుంటుంది. గోపాలయ్య కన్నీరుకారుస్తూ ఇదంతాచూస్తూ నుంచుంటాడు.)

అనంతం:- ఇదిగో ఈమాటు వీరిని మీకు పరిచయంచేస్తాను. వీరు గోపాలయ్యగారు, విరాజపురం జమీందారు - మాయ అంటే మీరా తండ్రి గారు.

(పార్వతమ్మ భయంతో చూస్తుంది. రామయ్య నమస్కరిస్తాడు.)

రామయ్య:- (మాట స్వాధీనంలోకి తెచ్చుకుని) గోపాలయ్యగారూ, అమ్మాయి మీదే, కాని—

గోపా:- (తల అడ్డంగాతిప్పి) ఉహుఁ. అమ్మాయి నాదికాదు—మీదే. మేము కన్న తల్లి తండ్రులం మాత్రమే - నిజానికి పెంచిందీ, పెద్ద దాన్నిచేసిందీ మీరు. ఆపిల్లి ఎవ్వరిచేలనోపడి ఏఅవస్తలోనోపడకుండా మీరు రక్షించారు, పోషించారు. ఈనాడు నేనువచ్చి తండ్రిననే అధికారంతో ఆపిల్లను మీ అండనించి లాక్కుపోతే భగవంతుడుకూడా సహించడు. అమ్మాయిని మీదగ్గరేఉంచుకోండి. అయితే....అయితే రోజూ ఒక్కమాటువచ్చి మేము చూసిపోవటానికి, మాట్లాడిపోటానికి అనుమతివ్వండి. చాలు—మాకికేమీ అక్కర్లేదు....

(దుఃఖంతో గొంతుపట్టుకుపోతుంది. రామయ్యను గోపాలయ్య వచ్చిపట్టుకుంటాడు. ఆతర్వాత ఇద్దరూ ఎడంగాపోయి మెల్లగా మాట్లాడుకుంటూ ఉంటారు. పార్వతమ్మకూడా వారిలోపోయి కలుస్తుంది.)

నళిని:- (మెల్లగా) అమ్మాయి రామయ్యగారిదీకాదు, గోపాలయ్య గారిదీకాదు. మీరా! నువ్వెవ్వరిదానివో నాకుతెలుసు.

మీరా:- ఎవ్వరిదాన్ని?

నళిని:- వారిదానివి! (అనంతాన్ని చూపుతుంది.) ఈయన్నెక్కడో చూసినట్టుగాఉందే! నీ డిటెక్టివు ఫరవాలేదే!

మీరా:- మీ నత్తి ఆయనకంటే బాగున్నాడా?

నళిని:- ఊఁ!

(గోవిందు మెడపట్టుకుని భీమసేనరావు వస్తాడు.)

భీమ:- చి చి చిక్కాడు!—ఇ ఇదేమిటి? మీరంతా ఇక్కడా? న న నళినిదేవికూడా ఉందే! స స సంగతేంటి?

నళిని:- ఇక్కడ వ్యవహారం చాలా గంభీరంలోపడింది.

భీమ:- నాకేమీ అర్థంకావటంలేదు. సరే! మి మి మీరంతా ఉన్నారు. ఒ ఒ ఒకందుకు మంచిదే. మి మి మీ ఎదటే ఈ డి డిటెక్టివ్ ముక్కు బద్దలుకొడతాను.

నళిని:- ఎందుకూ? ఏంచేశా డాయనా?

భీమ:- ఆవాళ నీబూటు విప్పదీయమంది వీడే! ఇవ్వాళ వీడి నౌకరు చేత బయటపెట్టించాను,

(గోవిందును ఊపుతాడు.)

గోవిందు:- (బతిమాలినట్టు) చిత్తం. ఈయన నన్ను ఒకచీకటిగళ్ళి లోకి తీసుకుపోయి గొంతుపిసకటం మొదలుపెట్టాడు. అందుకనే నేను చిటికెలమీద అంతా చెప్పేశాను.

భీమ:- (గోవిందును వదిలి) డి డి డిటెక్టివ్! ఇక కక కాచుకో! ఇవ్వాళ నీకు మూడింది.

(చొక్కా చేతులు పైకితీస్తాడు.)

అనంతం:- చూడండి. ఇవ్వాళ నా మనసెంతో ఆనందంగా ఉంది. అంచేతనే నేను మిమ్మల్ని ఏమీచేయదలుచుకోలేదు. కాని, ముందుగానే హెచ్చరిస్తున్నాను. నాకు బాక్సింగ్‌కాదు రిజలింగ్ కూడా తెలుసు! నా వొంటిమీద చెయ్యివేశారా, చాలా ప్రమాదంలో పడతారు.

భీమ:- భేష్! అదీ చూద్దాము, నీ రిజలింగ్ గొప్పో నా బాక్సింగ్ గొప్పో!

(కలబడటానికి సిద్ధమౌతాడు.)

మీరా:- నెల్లీ! మీ భీమసేనరావు గనక మా—మా డిటెక్టివు వొంటి మీద చెయ్యివేశాడా, ఇక ఈజన్మలో నీతో మాట్లాడను.

నళిని:- నన్నేం చెయ్యమంటావూ?

మీరా:- నువ్వుపోయి సర్దూ మీ భీమసేనరావుని.

నళిని:- (లేచిపోయి) ఆగండి, మీరు పోట్లాడనక్కర్లేదు.

భీమ:- ఎ ఎ ఎందుకనీ?

నళిని:- (చేతులుపట్టుకుని) నా ఆజ్ఞ!

భీమ:- (పరవశమై) నీ ఆజ్ఞా?

నళిని:- ఆఁ! ఏం? నేను మిమ్మల్ని ఆజ్ఞాపించకూడదా?

భీమ:- ఎ ఎవరన్నారూ, కూడదని! కాని వాడిముక్కు బద్దలు కొట్టాలి.

నళిని:- అక్కర్లేదు! ఆయన మీరా—(చెవులో చెప్పతుంది.)

భీమ:- ఆఁ, అట్లాగా?

అనంతం:- భీమసేనరావుగారూ! నళినిని బూటు విప్పదీయమనటం నాదితప్పని వొప్పుకుంటున్నాను. ఆమె మాయఅని పొరపాటుపడ్డాను.

భీమ:- న న నాకేమీ అర్ధంకాలేదు. ఐనా మీరు తప్పును వొప్పుకున్నారు కాబట్టి నాకేమీ కష్టంలేదు.

(ఇద్దరూ కరస్పర్శచేసుకుంటారు)

గోవిందు:- చిటికెలో మీరు స్నేహంచేసుకున్నారు. మధ్యను నేనే గొంతునలిగి చచ్చింది.

అనంతం:- (మీరా పక్కనుకూచుని) ఈరాత్రి చాలా అద్భుతమైంది అరేబియన్నైట్స్ కథలాగాఉంది.

నళిని:- మీరా! నువ్వేదన్నా పాటపాడవే! ఇంత చక్కటిరాత్రికి, అంత చక్కటిగీతం పాడినప్పుడే రమ్యంగాఉంటుంది.

మీరా:- నావల్ల కాదే, కాలు బెణికింది, అంతకంటే నువ్వుపాడరాదూ, నీపాట అంటే భీమసేనరావుగారికి భలేయిష్టం!

భీమ:- అ అంటే?

(నళిని వేలు అతని పెదాలమీద పెట్టి ఆపుతుంది. తర్వాతపాట.)



Printed at the B. N. K. Press Q. H. No. MS 100/B.
For Q. H. No. 401. Cat D. 750 Copies—February 1947.

# నటించదగిన నాటకాలు

| | | |
|---|---|---|
| ఉపరనిమిత్తం | మైత్రా | 1- 0-0 |
| ప్రణయరోగులు | షెరిడాన్ | 1- 0-0 |
| విశ్వం పెళ్లి | యజ్ఞన్నశాస్త్రి | 0-12-0 |
| కల్యాణి | ,, | 0-12-0 |
| జ్యోతిర్మయి | అ. వెంకటనరుసు | 1- 0-0 |
| డిటెక్టివు | శరదిందు బెనర్జీ | 0-12-0 |
| చిత్రాంగి | చలం | 1- 8-0 |
| త్యాగం | ,, | 1- 8-0 |
| సుంగమ్మ | ,, | 1- 0-0 |
| జయదేవ | ,, | 1- 0-0 |
| శశాంక | ,, | 1- 0-0 |
| సావిత్రి | ,, | 0-12-0 |
| నాటికాగుచ్ఛము | (నాటికలు) | 1- 4-0 |
| సత్యం శివం సుందరం | ,, | 1- 4-0 |

యువ బుక్ డిపో

మద్రాసు బెజవాడ



64

## ఇతరులవి

| | | | |
|---|---|---|---|
| ఈస్టలిన్ | (విషాదాంత నవల) | | 2- 0-0 |
| కడపటిమాట | (డిటెక్టివ్ నవల) | | 0-12-0 |
| మాయమైన మణిహారం | ,, | | 0-12-0 |
| తప్పిపోయిన పెళ్ళికూతురు | | | 0-12-0 |
| తగినశాస్తి | | | 0-12-0 |
| చచ్చిపోయిన మనిషి | [పా. ప] (నవల) | | 0-12-0 |
| కదంబం | [నార్ల] | | 0-12-0 |
| పొగడదండ | [కొ. పద్మావతి] | కథలు | 0-12-0 |
| రూం టు లెట్ | [పి. బా. శాస్త్రి] | ,, | 0-12-0 |
| సిపాయికథలు | [శిష్ట్లా] | ,, | 0-12-0 |
| మూగజీవాలు | [గోఖలే] | ,, | 1- 4-0 |
| రాజు-మంత్రి | [యం. యస్. మూర్తి] | ,, | 0-12-0 |
| చుక్కలు గీతలు | | ,, | 1- 0-0 |
| హర్ హైనెస్ | | | 1- 0-0 |
| మాలోమేము | [కొ. కృష్ణమూర్తి] | ,, | 1- 0-0 |
| పలితకేశము | [దువ్వూరి] | కావ్యం | 1- 0-0 |
| స్వప్నవాసవదత్తము | [కాటూరి] | నాటకం | 0-12-0 |
| సెలవు | [కప్పగంతుల] | | 1- 0-0 |
| ఋణవిముక్తి | ,, | | 1- 0-0 |
| గర్వభంగం | (ధనికొండ) | [కథలసంపుటి] | 1- 0-0 |
| ప్రియురాలు | ,, | ,, | 1- 0-0 |
| సంజీవి | ,, | [కథలసంపుటి] | 1- 0-0 |
| పవిత్రులు | ,, | [దృశ్య నాటిక] | 1- 4-0 |



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA109B196 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |